# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాదు



దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర, విశారద స్నాతకోత్సవము మరియు అమృతోత్సవము
సందర్భంగా శ్రీ కడారు మల్లయ్య గారు సంయోజకులు



దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర,విశారద స్నాతకోత్సవము మరియు అమృతోత్సవము సందర్భంగా
ఆంధ్ర సభ కోశాధ్యక్షులు శ్రీ ఎమ్. రఘుపతి గారు సందేశములు చదువు చున్నారు

టెలిగ్రామ్ : హిందీ సంఘ్ 　　　　ఫోన్ : 316865

510

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

డిశంబరు 1996

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చందా
రూ. 40-00

విడి ప్రతి
రూ. 4-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

---

# ఈ సంచికలో.....

# సంపాదకీయం

## శ్రద్ధాంజలి

స్వతంత్రతాసేనాని, పరిపాలనాదక్షుడు, భారత జాతీయ కాంగ్రెసు నాయకుడు, భారతీయ భాషాభిమని డాక్టరు మర్రి చెన్నారెడ్డి గారు గత సోమవారం ఉదయం హైదరాబాదులో కన్ను మూశారు. వారి మరణానికి అశేష జనానీకం అశ్రు తర్పణం చేస్తున్నది. వారికి హృదయ పూర్వక నివాళు లర్పిస్తున్నది. ఆయన వృత్తికి డాక్టరు, అయినా ఆ వృత్తిని పరిత్యజించి నిజాం ప్రభుత్వపు దురాగతాలను ఎదుర్కొన్న ధీశాలి. ధృఢ సంకల్పం ఆయన ప్రత్యేకత. ఎన్ని వొడిదుడుకులు వచ్చినా, ఎంతటి విపరీత పరిస్థితులు ఏర్పడినా ధైర్యంతో ఆ పరిస్థితులను, ఆటంకాలను ఎదుర్కొని విజయం సాధించిన దాకా నిద్రబోని స్వభావం వారిది. సంభాషణలలో ఎంత మృదుభాషి అయినా అవసరమొచ్చినపుడు ఎంతటి వారినైనా ఎదురించి నిర్మొహమాటంగా వ్యవహరించడం - మాట్లాడడం - ఆయన స్వభావం. అందువలన రాజకియాలలో ఆయన ఎన్నో వొడిదుడుకులు ఎదుర్కొనవలసి వచ్చింది. ఎదుటివారు ఎవరు ఏమనుకొన్నా తను నమ్మిన దానికై నిర్విరామ కృషి జేసి విజయం సాధించేవారు. ప్రత్యర్థుల శక్తి సామర్థ్యాలను అంచనా వేయడంలో ఆయన అందె వేసిన చేయి. ఆయన అనేకం పదవులు అధిష్ఠించారు. పదవివున్నా లేకపోయినా లెక్క చేయక తాను నమ్మిన దానికై పదవులను గూడా వదలి పెట్టారు. ఆయన దైవ భక్తులు. హిందూ ధర్మ శాస్త్రమన్నా, ఆచార వ్యవహారాలన్నా ఆయనకు భక్తి శ్రద్ధ లెక్కువ. ఆడంబరంగా గాక వాటిని తన నిత్య జీవితంలో అమలు చేయడానికి ప్రయత్నించారు. కార్తీక సోమవారమంటే ఆయనకు మక్కువ, సోమవారంనాడే ఆయన పరమపదించారని ఆయన సహ ధర్మచారిణి సావిత్రి దేవి గారన్న మాటలు నిత్యసత్యాలు. వారి మరణంతో ఒక శకం ముగిసింది. తెలంగాణా చరిత్రలో-దేశ చరిత్రలో ఒక అధ్యాయం ముగిసింది. శ్రీ రెడ్డి గారికి మా కృతజ్ఞతా పూర్వక శ్రద్ధాంజలి.

స్రవంతి ప్రాదుర్భావంతో గూడా శ్రీరెడ్డి గారికి సన్నిహిత సంబంధమున్నది. హిందీ అంటే వారికి చాలా అభిమానం. తెలుగు సాహిత్యమన్నా ఆయనకు వల్లమాలిన ప్రేమ. దక్షిణ భారత

హిందీ ప్రచార సభ హైదరాబాదు శాఖతో వారికి సన్నిహిత సంబంధముండేది. దానికి వారు ఉపాధ్యక్షులుగా వుండేవారు. ఆ శాఖ నిర్మాణంలోనూ, దానికి రూప కల్పన చేయడంలోనూ వారికి సన్నిహిత సంబంధముండేది. వారు అధ్యక్షులుగా లేని హిందీ సభలు, సమ్మేళనాలు సభ పక్షాన ఆ రోజుల్లో జరిగేవి గావంటే అతిశయోక్తి లేదు. విశాలాంధ్ర ఏర్పడిన తరువాత హైదరాబాదు శాఖ ఆంధ్ర శాఖతో కలిసి దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర ఏర్పడింది. ప్రధాన కార్యాలయం విజయవాడ నుండి హైదరాబాదుకు తరలించబడింది. అందుకుగూడా శ్రీరెడ్డి గారు చేసిన కృషి ప్రశంసనీయం. వారు స్వయంగా హిందీ నేర్చుకున్నారు. హిందీ వ్యాకరణం శ్రద్ధగా పఠించారు. మినిస్టరుగా వుండి గూడా హిందీ తరగతికి హాజరయ్యేవారు. పాఠశాలల్లో హిందీ మూడో తరగతిలో ప్రారంభంకావలెనని వారి అభిప్రాయం. విశాలాంధ్ర ఏర్పడడం వలన అది సాధ్యం కాలేదు. హిందీ ఐదు నుండి ప్రారంభమయినది. కాని శ్రీ ఎన్.టి. రామారావుగారు ముఖ్యమంత్రి అయిన తరువాత వారు హిందీని ఎనిమిదో తరగతి నుండి ప్రారంభించవలెనని ఉత్తర్వులు జారీ చేశారు. దానితో నాలుగు వేల మంది హిందీ పండితులు ఉద్యోగం కోల్పోయే పరిస్థితి గూడా ఏర్పడింది. హిందీ సంస్థలూ, హిందీ అభిమానులూ ఆ వుత్తర్వుకు వ్యతిరేకంగా హిందీ రక్షణ సమితి అనే పేరుతో ఉద్యమం నడపవలసి వచ్చింది. ఆ ఉద్యమ ఫలితంగా హిందీ ఉపాధ్యాయుల ఉద్యోగాలకు రక్షణ లభించినా శ్రీ రామారావు గారి నిర్ణయం మారలేదు. హిందీ ట్రైనింగు విద్యాలయాలు మూతబడినవి. కొంత కాలం హిందీ ప్రచారాన్ని నిరాశ పరచే వాతావరణం ఆంధ్రలో ఏర్పడింది. తిరిగి శ్రీ చెన్నారెడ్డిగారు ముఖ్యమంత్రి కాగానే వారు శ్రద్ధ తీసుకొని వెంటనే శ్రీ రామారావు గారి ఉత్తర్వులు రద్దు చేసి హిందీకి పూర్వపుస్థితిని కల్పించారు. హిందీ విద్యాలయాలు ప్రారంభమైనవి. హిందీ వ్యాప్తికి మంచి అవకాశ మేర్పడింది. ఆ పనిని నిమిషాలలో చేసి వేశారు. అదీ వారి కార్యదక్షత, హైదరాబాదులో దక్షిణ భారత హిందీ ప్రచార సభ పి.జి. కేంద్రానికి శ్రీ రెడ్డి గారే ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్ర సభ వారికి ఎంతో ఋణ పడివున్నది. వారి మరణంతో ఏర్పడిన లోటు తీర రానిది. వారికి మా హృదయ పూర్వక శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము. వారి కుటుంబానికి మా సానుభూతిని తెలియజేస్తున్నాము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# విశ్వనాథ సాహిత్యంలో శ్రీకృష్ణశిశువు

- డా॥ టి. శ్రీరంగస్వామి

విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన సాహిత్యంలో శ్రీకృష్ణ విషయం ఒక ప్రత్యేక అంశంగా కనిపిస్తుంది. అటు శివుడు, రామచంద్రులతోపాటు కృష్ణుడు కూడా మనకు దర్శనమిస్తాడు. ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తిలోని అద్భుతమైన సమన్వయ లక్షణాన్ని వ్యక్తీకరిస్తాడు.

శ్రీకృష్ణ తత్త్వము అతి విచిత్రమైనది. జ్ఞాన భక్తులు రెండింటికి అది స్థానము. శ్రీరామచంద్రుని గూర్చి "పుంసాం మోహనరూపాయ" అని చెప్పబడుతున్నది. కాని శ్రీకృష్ణుని మోహన తత్త్వము మిక్కిలి విలక్షణమైనది. సృష్టిలోని సౌందర్యానికంతటికీ శ్రీకృష్ణుడు ప్రతీక. జయదేవ, బిల్వమంగళాదులు గీతగోవింద, కృష్ణ కర్ణామృతాదులలో శ్రీకృష్ణ తత్త్వాన్ని సౌందర్యమహితంగా తీర్చిదిద్దినారు.

సత్యనారాయణగారు కృష్ణపరంగా రచించిన వాటిలో 'శృంగారవీధి' కావ్య సంకలన మొకటి. ప్రాత:కాలములో భగవంతుని స్తోత్రం చేయడం అనగా పొగడటం ఈ కావ్యంలోని ఖండిక "ప్రాత:స్తవము" . ఈ దృష్టితో దాని స్తుతి కావ్యమనవచ్చు. వామనస్తోత్రం మొదలైన అనేక స్తోత్రాలు ప్రాత:కాలములో పఠించదగినవి ఎన్నో ఉన్నా వాటి తీరుకీ ఈ ప్రాత:స్తవ విధానానికి సంబంధంలేదు.

భక్తిరసాలలో వత్సలభక్తి ఒకటి. వత్సలభక్తినే వాత్సల్య భక్తి అంటారు. భక్తి సాహిత్యంలో వత్సల భక్తికి సంబంధించిన రచనలు విరివిగానే కనిపిస్తాయి. కృష్ణ కర్ణామృతం వంటి ముక్తక కావ్యాలలో వాత్సల్యానికి సంబంధించిన మధురాతి మధురమైన పద్యాలు ఎన్నో కనిపిస్తాయి. వాటిలో పెరియాళ్వారు "తిరుమోళి" ఒకటి. బసవపురాణంలో పరమేశ్వరుని పసిపాపగా భావించి బెజ్జ మహాదేవి శివుని శిశుత్వాన్ని తల్లిగా సేవిస్తుంది. "ముద్దుగారే యశోద ముంగిట ముత్య ములిడు" లాంటి అన్నమాచార్య కీర్తనలలో ఈ వాత్సల్య భావాన్ని చూడవచ్చు. పోతనగారి భాగవత దశమస్కంధంలో కృష్ణ బాల లీలలలో ఈ వాత్సల్యాభావం వాగులై వరదలై పొంగులువారింది. మాతృప్రేమ అనేది సర్వజీవ సహజ మైంది. దానికి జాతి భాషాదుల పరిమితులు లేవు. కాగా అత్యంత సహజమూ, మధురమూ అయిన వాత్సల్య భావమే ప్రాత:స్తవ కావ్యానికి విషయం. పెద్దలకు, పిల్లల యందుండే ప్రేమభావాన్ని వాత్సల్యమంటారు. గురువులు, తండ్రి మొదలైన వారికి పిల్లలయందుండే ప్రేమభావం వాస్తవానికి వాత్సల్యమే అయినా, తల్లికి పిల్లలయందుండే వాత్సల్యం మిగతావారిలోని వాత్సల్యంకన్నా ఎంతో గొప్పది. ఎంతో విస్తృతమైనది. ఎంతో మధురమైనది. అందుకే వాత్సల్య భావానికి సంబంధించిన విస్తృతమైన సాహిత్యంలో మాతా శిశుసంబంధమే తొంబయితొమ్మిది వంతులు కన్పిస్తుంది.

భగవద్విషయమైన ఈ వాత్సల్య భావం ప్రధానంగా యశోదా కృష్ణులకు మాత్రమే అధికంగా సంబంధించి ఉండడం కూడా వాత్సల్య సాహిత్యంలో గుర్తించవలసిన మరొక అంశం. యశోద కృష్ణుని తల్లికాదు. ఆయనను కన్నతల్లి దేవకి. కాని దేవకికి కృష్ణుని బాల్యాన్ని అనుభవించే అదృష్టం లేకపోయింది. యశోదకు అది లభించింది. వాత్సల్య భావంలో ఉండే మాధుర్యం పిల్లల బాల్యదశలో వ్యక్తమైనంతగా అనుభవమైనంతగా ఆ పిల్లలు పెరిగి పెద్దవారైన తరువాత అనుభవములోనికి రాదు. అందుకే వాత్సల్య చిత్రణం పిల్లల బాల్యదశకు మాత్రమే సంబంధించి సాగుతుంది. శ్రీకృష్ణుని బాల్యాన్ని పూర్తిగా అనుభవించిన యశోద. కృష్ణుని బాల్య చేష్టలను అనేకానేక విధాలుగా అనుభవించింది. కృష్ణుడు కూడా ఆమె విషయంలో అట్లాగే ప్రవర్తిస్తాడు. యశోద వాత్సల్యానికి

కృష్ణుడు ఆలంబన. ఒక విధంగా ఇది ఆత్మాశ్రయకావ్యం. యశోద శ్రీకృష్ణుని ప్రాత:కాలంలో మేల్కొల్పుట ఈ కావ్యంలోని మౌలిక వస్తువు.

ఈ మేలుకొలుపు అనే భావము తొలిసారిగా మనకు రామాయణములో కనిపిస్తుంది. మేలుకొలుపుతున్న ఈ క్రింది శ్లోకం సుప్రసిద్ధం,

"కౌసల్యా సుప్రజా రామ ! పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్"
(రామాయణము - బాలకాండ - 23వసర్గ)

విశ్వామిత్రునికి శ్రీరామచంద్రునియందు పుత్ర వాత్సల్యం, దానితోపాటు తాను గురువుగా శ్రీరాముని అనుశాసించడం కూడా ఉంది. ఈ మేలుకొలుపులో ఈ రెండంశాలు స్పష్టంగా కనిపిస్తాయి.

"ఓ కౌసల్యా సంతానమైన రామా ! తెల్లవారింది ఓ నరశ్రేష్ఠుడా ! దైవికమయిన దైనిక కృత్యాలను నిర్వహించుటకు లే ! అని విశ్వామిత్రుడు మేలుకొలుపు తున్నాడు. రామచంద్రుని దశరథ సంతానమని సంబోధించ చ్చును. కాని కౌసల్యా సంతానమనుటలో మాతృభావాని కున్న గాఢత్వం ఇక్కడ స్పష్టమవుతుంది. దైవిక, దైనిక కృత్యాల ప్రస్తావనతో అనుశాసనం కూడా ఉంది. రామా యణానంతర కాలాన మేలుకొలుపుగా వచ్చిన రచన లన్నిటికీ ఈ శ్లోకమే మార్గదర్శకం. "మార్గదర్శీ మహర్షిః" ఈ విధముగా ప్రాతఃకాలములో భగవంతుణ్ణి మేలుకొలుపు తున్నట్లుగా ఉండే రచనలను "సుప్రభాతము" అని వ్యవ హరించటం సర్వసాధారణమయింది. రామాయణంలో విశ్వామిత్రుడు మరొకచోట రామచంద్రుని మేలు కొలుపుతూ-

"సుప్రభాతానిశారామ ! పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే గమనా యాభిరోచయ"

అంటాడు. (రామాయణ - బాలకాండ - 3వ సర్గ)

ఈ మేలుకొలుపటమనే విషయంగా గల విశ్వనాథ వారి ఖండిక "ప్రాత.స్తవము". ఇందులో యశోద కృష్ణుని మేలుకొలుపుతూ, తల్లిగా కృష్ణుని వివిధ గుణాలను, చేష్టలను కూడా స్మరిస్తూ, అను భవిస్తూ ఉంటుంది. ఈ ఖండికలో నున్న పద్యాలు మొత్తం 41 యశోద మాటలుగానే ఉంటాయి.

ప్రాతఃస్తవంలో యశోద మేలుకొలుపే విధానం, మాట్లాడే తీరు, వ్యక్తంచేసే వివిధ భావాలు అచ్చంగా ఒక తెలుగుతల్లి తన కొడుకును మేలుకొలుపుతున్నట్లుగానే ఉంటుంది. ఇందులో తెలుగు దేశీయ వాతావరణం. పలుకుబడి సమృద్ధిగా కనిపిస్తున్నవి. మేలుకొలుపుతూ మాట్లాడటంలోనే శ్రీకృష్ణునికి సంబంధించిన లౌకిక అలౌకిక విషయాలు విచిత్రంగా ఆ తల్లివాత్సల్యంలో కలగలసి పోతాయి. ఆ కృష్ణుడు అమాయకుడు, దుందుడుకు, వయసుకు మించిన చేష్టలు చేసేవాడు. ఆయనలో చిలిపి తనానికి అంతం లేదు. ఇవన్నీ యశోద మాటలలో వ్యక్తమౌ తుంటాయి. ప్రతి తల్లి తన కొడుకును గూర్చి గొప్పగా భావిస్తూ ఉండటం సహజం. వాడు జీవితంలో ఎంతో గొప్పవాడు కాబోతాడని, భావించి అలా అయినప్పటి సంతోషాన్ని ఈ దశలోనే తల్లి భావించుకుంటూ వ్యక్తం చేస్తూ ఆనంద పడుతుంది. ఈ తల్లి భావనలన్నీ ఆ పిల్లల జీవితంలో నిజం కావచ్చు. కాకపోవచ్చు. ఈ కావటం కాకపోవటంలో కూడా ఎన్నెన్నో తేడాలు ఉండవచ్చును. కాని భగవంతుని విషయంలో ఏది భావించినా అది యదార్థమే అవుతుంది

యశోద విషయం విచిత్రమైంది. ఆమెకు అంత లోనే శ్రీకృష్ణునియందు భగవద్భావన, అంతలోనే తన చేతులలో పెరిగే పసిపాప. భావన ఈ రెండు భావాలు చిత్ర విచిత్రంగా ఆమె మాటల్లో వ్యక్తమవుతుంటాయి

"ఎవడురా వాడు మొన్న తానేమొవచ్చి
యయ్యవతార పురుషుండటంచుఁ జెప్పె
నిపుడు వచ్చినఁ తెలియుఁ గదే నిశాప్ర
ళయ శిశువొ సన్నెఱుంగువేళకును లేడు"

తన కొడుకును గూర్చి తల్లి గొప్పగా భావించటం ఇందులో ఉంది. అట్లాగే కృష్ణుడు అవతార పురుషుడు

కావడం యదార్థమే. "నిశాప్రళయ శిశువు" కావడం కూడా యదార్థమే. ఈ రెండంశాలు ఇక్కడ వాత్సల్యపూరితమైన వెక్కిరింపుగా పరిహాసంగా కూడా వ్యక్తమయినవి.

"అచ్చపువేల్పుబువ్వ బుడగ్గై తరగై గరుడాళువారిపై
వచ్చెడు చిట్టికోసమని, వాకిటనున్నది యెవ్వరోయి వేఁ
బుచ్చుకొనుండు వానిఁ జిఱుపొంగుల నవ్వుల కన్నుదమ్ములన్
విచ్చుచునున్నవాడు యదువీరుడు బుగ్గ గులాబి మొగ్గగాన్"

ఇందులో శ్రీకృష్ణుడు విష్ణువు అవతారమనే భావం, కృష్ణుని బులిపించటం అనే భావంతో కలగలసిపోతుంది.

"ఇంక నిద్దుర లేవ వీవెట్లుకాని
నెలల తరబడి నా బిడ్డ నిద్రపోవు
నుర్వియెల్ల జాతుర్మాస్యములుండవచ్చు
నని జగంబున జాటింతునయ్య! కొడుక!"

విష్ణువు నాలుగు మాసాలు నిద్రలో ఉంటాడని ఎప్పుడు భక్తులు చాతుర్మాస్యవ్రతం పాటిస్తారని ప్రసిద్ధి. ఇక్కడ కృష్ణుడు చాలాసేపు నిద్రపోతున్నాడు. నిద్రలేవటం లేదు అనే భావాన్ని "చాతర్మాసాల"కు కూర్చడంలో లౌకిక, అలౌకిక భావాల మిశ్రణ తెలుస్తున్నది. ప్రాతఃస్తవములో కనిపించే మరొక విశిష్టలక్షణం మొత్తం స్తవం ఏకపాత్రాభినయముగానే సాగటం. అంతా యశోదాదేవి మాట్లాడడం తప్ప, శ్రీకృష్ణుని మాటలేమీ లేవు. ఇట్లాంటి సందర్భంలో ఉండవు కూడా. కాని ఆయన చేష్టలున్నాయి. ఈ చేష్టలన్నీ ఉద్దీపన విభావాలు.

ఆ చేష్టలన్నీ యశోదాదేవి మాటలద్వారానే మనకు స్పష్ట పడుతుంటాయి.

"పాలపాలకన్నువిప్పి మఱిమూసెడు
చిట్టెక్కినిక్కమాడు, చ
క్కిలి గిలియున్నదా? కలదు, కేలును జంకకు
హత్తుకొంచు న
వ్వుల చిఱువెల్గులొ ( బెదవిపొందె నుషోనవ రేఖ
తీర్థి య
వ్వలి మొగమై ముడుంచుకొని పండెద, వల్లరి
కాదు లెమ్మురా!'

అంటున్నప్పుడు యశోద కృష్ణుని లేపడానికి చక్కలిగింత పెట్టడందా, న్నించి తప్పించుకోవడానికి కృష్ణుడు చేతిని చంకకు హత్తుకోవడం, ముఖం ప్రక్కకు తిప్పుకోవడం, మరింత ముడుచుకొని పడుకోవటం వంటి వివిధ చేష్టలు వ్యక్త మౌతుంటాయి. ఇవన్నీ శైశవ సహజమయిన చేష్టలే. ఇక్కడ "స్పర్శ" అనే భావము వ్యంజితమవుతుంది. యశోద మాటల్లో కృష్ణుడు కాక కృష్ణుని సావాసగాండ్రు, వారితో కలిసి వ్రేపల్లెలో కృష్ణుడుచేసే రకరకాల అఘాయిత్యాలు కూడా వ్యక్తమవుతుంటాయి అనటంలో వాత్సల్య పూరితమైన చిరుకోపం ప్రదర్శింప బడుతుంది. ఇక్కడ "భాణం" అనే రూపకభేదములో రచన సాగుతుంది.

ప్రాతఃస్తవములో సంబోధనలు కూడా చిత్ర విచిత్రంగా ఉంటాయి. యశోద కృష్ణుడిని "యశోదాత్మజా' అని సంభోదిస్తుంటుంది. అందులో వాడు తన కొడుకు కావడం వల్ల కలిగిన ఒక మాధుర్యభావంకలగలసి వ్యక్తమౌతుంటుంది. "విచిత్ర శిశువా, ఏసిదొంగా, నవనీతలుబ్ధుడు' మొదలైనవి ముద్దును వ్యక్తీకరిస్తాయి. కొడుకును ఆ తల్లి బుజ్జగిస్తుంది. కోప్పడుతుంది. సముదాయిస్తుంది. విసుక్కుంటుంది, కన్నీరు పెట్టు కుంటుంది. ఆప్యాయతను వ్యక్తీకరిస్తుంది. ఇందులో మాతృవాత్సల్యానికి సంబంధించిన రకరకాల తీరులు ఎంతో మధురంగా వ్యక్తమౌతాయి. కృష్ణుని నిద్రనుంచి లెమ్మనడంతో ఆరంభమయ్యే ఈ ఖండకావ్యం కృష్ణుడు కాళ్ళగజ్జెలు ఘల్లు ఘల్లు మనగా లేచి గంతులు వేస్తూ ఉండటంతో సమాప్తమవుతుంది. ప్రతి పద్యములో మనకు శ్రీకృష్ణశిశువు, అతని స్వరూపము మనకు స్పష్టముగా కనబడుతుంది. ఇక్కడ యశోద భావము మాతృవాత్సల్య పూర్వకముగా చేసే భగవత్సేవయే.

ఇది ప్రాత:స్తవములో విశ్వనాథవారు శ్రీ కృష్ణశిశువును దర్శించారు.

*ఇంటి.నెం. 5-11-481, విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009.*

# నెహ్రూ వ్యక్తిత్వం
# ప్రజాస్వామ్యం - జాతీయ సమైక్యత

*- మాదిరాజు రంగారావు*

"ఈ యుగం తలుపు తెరిస్తే
అణువణువులో స్పందిస్తూ
హృది హృదిలో కనిపించే
నవ భారత బింబం - నెహ్రూ"

జనవరి 26, 1950 నుండి స్వతంత్ర భారత దేశం అవలంబించే పురోగమన స్వరూపమూ దాని పథమూ స్పష్టమవుతున్నది. ఈ రిపబ్లిక్ దినం నుండి భారత రాజ్యాంగం అమలులోకి వచ్చింది. భారత దేశచరిత్రలో స్వాతంత్ర్యోదయంతో ఆరంభమైన కొత్త యుగానికి ప్రయాణ రూపం సిద్ధమైంది. ఇది ప్రజాస్వామ్య చేతనతో జాతీయ సమైక్యతా సూత్రంతో అస్తిత్వాన్ని పొందింది. స్వేచ్ఛ సమానత్వం కలిగి కుల, మత, ప్రాంత భేదాల్ని అధిగమించిన ఐక్య భావనతో ఉత్ప్రేరితమైంది. ఆసేతుహిమాచలం ఒకే ఒక సమైక్య సూత్రంపై నిలిచింది. ఈ సూత్రపంక్తిని చెదరనీయకుండా సుదృఢంగా పిడికిట్లో నిలుపుకొని నిర్వహించిన ఖ్యాతి మొదటి ప్రధానమంత్రి పండిట్‌జీదే. మహాత్మాగాంధి నాయకత్వంలో సర్దార్ వల్లభాయి పటేల్, అబ్దుల్ కలామ్ ఆజాద్, రాజాజీ మొదలైన మహనీయుల విశిష్టసేవల్ని మరవడానికి వీల్లేదు. అగస్టు 15, 1947 అర్ధరాత్రి నుండి మే2, 1964 వరకు నెహ్రూ అవలంబించిన విధానాలు ఆ తరువాత కాలానికి ఆదర్శంగా నిలిచాయి. ఆధునిక భారతదేశ నిర్మాత. గొప్ప ప్రజాస్వామ్యవాది. జాతీయ సమైక్యతకు ప్రతినిధి, మానవతావాది రాజకీయ దార్శనికుడు. అంతర్జాతీయ నాయకుడు. శాంతి ప్రియుడు నెహ్రూజీ. మార్క్సు లెనిన్ ప్రభావంతో సామ్యవాదాన్ని ప్రజాస్వామ్య భావనకు పోషకంగా విశ్వసించిన ప్రగతివాది. ఇది చరిత్రకు కొత్త మలుపు నిచ్చింది. కొత్త దృష్టితోచూచే అవకాశాన్ని కలిగించింది. ప్రస్తుతానికి వస్తే ముఖ్యంగా ప్రజాస్వామ్యంపై అచంచల విశ్వాసంతో జాతీయ సమైక్యతపై తిరుగులేని దృఢ వైఖరితో కూడిన ఆయన విధానం, దేశానికి స్థిరత్వాన్ని ప్రసాదించింది. దీనితోపాటు పరిపాలనా నేతృత్వం రాజకీయ వివేకం, ఉదారతత్వం తోడ్పడినాయి. తన దేశాన్ని గురించి చింతనతోపాటు, ఇతరదేశాలతో సత్సంబంధాలు నెలకొల్పే ఆలోచనతో కూడిన ప్రపంచ దర్శన భావం నెహ్రూను ఇతర నాయకులకన్న భిన్నంగా ఆకర్షించింది. మిన్నగా నిలిపింది.

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఉల్లేఖనీయమైన పాత్రను నిర్వహించిన యశస్వి ఆయన. మహాత్మాగాంధీజీ వారసుడుగా పొందిన ఖ్యాతి అన్వర్థమైంది. ఒక మారు ఇండియా అంటే ఏమిటి? అన్న ప్రశ్నకు నెహ్రూ, "గాంధియే ఇండియా" అన్ని సమాధానం చెప్పారు. ఆ తరువాత "నెహ్రూయే ఇండియా" అనే విధంగా ప్రకాశించారు. దాదాపు పదహారు సంవత్సరాలు ప్రధానమంత్రిగా నెరపిన నాయకత్వం సమస్త భారతదేశంపై చెరగని ముద్రను వేసింది. ప్రజాసామ్య వ్యవస్థతోపాటు జాతీయ సమైక్య భావంతో ఏర్పడిన వ్యక్తిత్వ పార్శ్వం ఈనాటికీ ఏనాటికీ చెల్లుబడి అయ్యేనాణెం వలె ఎంతో ప్రయోజనాత్మకతను కలిగివున్నది. ఈ అంశం గురించి ఒక అవగాహన ఏర్పడితే నెహ్రూ తరువాత దేశంలో ఉత్పన్నమైన స్థితి గతుల్ని స్పష్టంగా పరిశీలించే అవకాశం కలుగుతుంది. ఎక్కడ ఈ

*విద్యారణ్యపురి, వరంగల్ - 506 009.*

భావ పరంపర విచ్ఛిన్నత్వాన్ని పొందింది, ఎక్కడ విషమత్వాన్ని పొందిందీ. ఏయే మార్పుల్ని తరువాత పొందిందీ సులభంగా గుర్తించవచ్చు. నెహ్రూ నిష్క్రమణం తరువాత స్థూలంగా ప్రజాస్వామ్యమూ జాతీయ సమైక్యతా కొన్ని ఒత్తిడులకు లోనైనవి. ఎన్నెన్నో విషమ స్వరాలతో ప్రకంపించినవి. తెలుగు సాహిత్యంపై ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రసరించిన ఆప్రభావ రేఖల్ని గుర్తించవచ్చు. కాలక్రమేణ ఇదొక పరిశోధనాంశంగా దృష్టికిరావడం సహజం. ప్రస్తుతం స్వేచ్ఛా కవిత్వంలో నెహ్రూ అనంతరం ముప్పై సంవత్సరాల్లో ప్రజాస్వామ్యమూ జాతీయ సమైక్యతా ఏ విధంగా ప్రతిఫలించిందీ పరిశీలన జరపడమే ప్రధానోద్దేశ్యం ఈ కాలంలో స్వేచ్ఛా కవిత్వాన్ని వ్రాసిన కవుల గ్రంథాల్ని కవులనూ గురించి అవసరమైన సమాచారాన్ని సేకరించడంతో పాటు వాళ్ళ సాహిత్యాన్ని సేకరించి భద్రపరచడం అవసరం.

నెహ్రూగారి మహనీయమైన వ్యక్తిత్వంలో ఒక ప్రముఖ పార్శ్వం మానవుని స్వేచ్ఛను కోరే గాంధీజీ నాయకత్వంలో దేశ స్వాతంత్ర్యం కోసం జరిపిన మహోద్యమ భాగం. మరో ప్రముఖ పార్శ్వం స్వాతంత్ర్యానంతరం ప్రధానమంత్రి పదవీ బాధ్యతలతో వినిర్మించిన దేశ వినిర్మాణ భాగం. చారిత్రక ప్రాముఖ్యం గల ఈ రెండు దశలూ కలిస్తేనేగాని ఆయన సంపూర్ణ వ్యక్తిత్వం ఆవిష్కృతంకాదు. తొలినాళ్ళలో సుఖకరమైన జీవితాన్ని వదిలి కష్టాల్ని సహించాడు. పధ్నాలుగు సంవత్సరాలు జైలు శిక్షనుకూడా అనుభవించాడు. సామాజిక రాజకీయ జీవితంలో ఉన్నతమైన విలువలకు ప్రాధాన్యం ఇచ్చే నెహ్రూ ఆదర్శాలు క్రింది వర్గంనుండి పై వర్గందాకా సామాన్యుల నుండి మేధావులదాకా అందరినీ ఆకర్షించడం విశేషం. ఇది ఈయన రచనల్లో ప్రసంగాల్లో స్పష్టంగా అనుభవానికి వస్తుంది.

సామ్యవాద ప్రభావంతో పరిణమించే ప్రజాస్వామ్యం నెహ్రూ దృక్పథంలో వర్గరహిత సమాజాన్ని కోరేదీ అందరికీ సమానమైన అవకాశాలతో ఆర్థిక సామాజిక న్యాయం అభిలషించేదీని. రాజకీయ రంగంలో ప్రజాసమ్మతమైందీ. జాతి సమగ్రవికాసానికీ ఉన్నతమైన విలువల్ని కాపాడే వ్యవస్థకూ దోహదం చేసేదీ ప్రజాస్వామ్య విజయంతో సామ్యవాదాన్ని సులభంగా సాధించ వచ్చునని ఈయనఅభిప్రాయం. ఈ పరిణామం సహజమైంది. ఇది ఏక పక్ష నియంతృత్వ వైఖరితో కాక అన్ని పక్షాలకూ చెందిన విలువైన అభిప్రాయాన్ని పరిగణనంలోకి తీసుకొని మరీ ఉపక్రమిస్తుంది. ఈ ఆదర్శం భారతదేశంలోని సామాజిక వ్యవస్థలో చైతన్యాన్ని కలిగించింది. క్రియాత్మకతను సిద్ధపరచింది. నెహ్రూ చైర్మన్‌గా ప్లానింగ్ కమిషన్ ఏర్పడింది. ఇది ఆర్థిక సామాజిక తలంపై ఆలోచనతో, క్రియాన్వయశీలంతో ఆరంభించిన ఉద్యమం. ఇది ఒక అవధిలో ముగిసేదికాదు. ఇదో అవిచ్ఛిన్నమైన పరిణామక్రమం. వ్యవసాయం పరిశ్రమలు విద్య శాస్త్ర సాంకేతిక ప్రగతీ మొదలుగా అనేక రంగాలు సునియోజితమైనాయి. దీని నిర్దేశకుడు నెహ్రూయే. ఉత్పత్తి అనేది సామాజికం. మొత్తం మీద సమాజ శ్రేయస్సుపై దృష్టితో దీన్ని నియంత్రణ చేయడం జరుగుతుంది. నెహ్రూ తానవలంబించే సామ్యవాదం గురించి మాట్లాడుతూ నాదృష్టిలో ఇదో సిద్ధాంత పరమైన వితర్కవాదానికి చెందింది కాదు. చైతన్యం ద్వారా క్రియాన్వయం ద్వారా అందరికీ ఆర్థిక న్యాయాన్ని త్వరితగతిని సమకూర్చేందుకు తోడ్పడేది. కార్యాచరణాన్ని వేగవంతం చేసేది. దీనికి శాస్త్ర సాంకేతికవైన విజయాలెంతగానో తోడ్పడతాయి అన్నారు. ఈయన విశ్వాసం శాస్త్రసాంకేతిక రంగాల్లో జరిగే ప్రగతి వలన ప్రజల జీవితాల్లో గుణాత్మకమైన మార్పుకు దోహదం చేయాలి. దేశ వినాశనకారిగా పరిణమించకూడదు.

బ్రిటిషు పాలకుల రాజనీతిలోని 'న' కారాత్మకమైన విధానం కారణంగా భారతదేశం మత ప్రాతిపదికపై విభజనకు గురియైంది. మత కలహాలవల్ల వేలాది ప్రజలు ఎన్నో కష్టాలకు నష్టాలకూ గురియైనారు. కల్లోలస్థితి

ఏర్పడింది. దారుణమైన సంఘటనలు జరిగాయి. ఈ విషమవాతావరణం గాంధీజీని కలచివేసింది. నెహ్రూను వ్యధపరచింది. ఈ విషమత్వాన్ని ఉత్తరించే మార్గం ఒక్కటే. అదే మతానికతీతమైన మానవతా రాగం. జాతిమత వర్ణ వివక్షతలేని మనోబంధం. పండిట్‌జీ దృష్టిలో మతం వ్యక్తిగత సంబంధాల వరకే పరిమితం, ప్రేమకూ, శాంతికి ఉదారతకూ నిలయం ప్రజలమధ్య స్నేహం సహనం శాంతి ఆదర్శంగా దేశసుస్థితి భావితమైంది. దీన్ని ప్రపంచిస్తూ ఆచరిస్తూ నెహ్రూ జాతీయ సమైక్యతకు ప్రతీకగా నిలిచాడు. ఆధునిక యుగంలో మత ప్రధానమైన రాజ్యానికి తావులేదు. భారతరాజ్యాంగం అన్ని మతాలనూ అభిప్రాయాలనూ గౌరవిస్తుంది. మత సంబంధమైన విషయాలలో రాజ్యం తటస్థంగా ఉండాలన్నదే నెహ్రూ అభిప్రాయం నెహ్రూ 1951లో సెక్యులరిజం అంటే, "The State that protects all religions and did not favour one at the expense of others and did not itself adopt any religion as the statereligion" అన్నారు. రాజ్యం అన్ని మతాలనూ సంరక్షించాలి. అయితే ఒక మతం పట్ల అభిమానంతో మరోమతాన్ని నిరసించకూడదు. ఏ మతాన్నీ రాజ్యమతంగా అవలంబించ కూడదు. మత విషయాల్లో రాజ్యప్రమేయం ఉండకూడదని ఈయన అభిప్రాయం అనేక చారిత్రక కారణాలవల్ల ఎన్నో వేల వందల ఏండ్లుగా వివిధ మతాల వారు జీవనం కొనసాగిస్తున్నారు. జీవికకై ఒక ప్రాంతంనుండి మరో ప్రాంతానికి వెళ్ళుతున్నారు. వీరందరూ భారతీయులే. బౌద్ధులు, జైనులు, ముస్లింలు, క్రిష్టియన్లు, యూదులు, నాస్తికులూ ఇంకా ఎందరో అందరికీ రాజ్యాంగం ప్రకారం అవకాశాలు సమానమే. వీరి మధ్య స్నేహం దేశసుస్థిరతకూ ప్రగతికి దారితీస్తుంది. ఈ విధమైన మతాతీతమైన లౌకిక తత్వం నెహ్రూ విధానాల్లో ప్రజాస్వామ్యం తరువాత పేర్కొనదగింది.

ఆధునిక భారతదేశమంటే సామాజిక రాజకీయ జాతీయాంతర్జాతీయ స్థాయిలో అపూర్వ వ్యక్తిత్వంతో సమాహితమైన రూపమే. ఈయన ఆదర్శాలు జాతి స్వరూపానికి నిర్మాణ రేఖలుగా ఉపకరించాయి. ఇది స్వాతంత్ర్యానంతరం పదహారేండ్ల పరిపాలనా కాలంలో సుప్రతిష్ఠిమైంది. ఈ మహావ్యక్తి అవసానంతో చరిత్రలో ఒక మహాధ్యాయం ముగిసింది. తరువాత తలెత్తిన సమస్యలూ ఎదురైన అవరోధాలూ ఎన్నెన్నో! కాలక్రమేణ ఇవి నిశితమైన పరిశీలనకు గురికావడం జరుగుతుంది. ఇది నెహ్రూ ప్రభావాన్ని ఆయుగ పరంపరగా సాగవలసిన అవసరాన్నీ తలపిస్తోంది. వారి జీవితంలో ప్రధానమైన భాగమంతా స్వాతంత్ర్యోద్యమంతోనూ దేశ వినిర్మాణ యోజనతోనూ పెనవేసుకుంది ఈ దేశానికి ఆధునిక రూపాన్ని ఇవ్వడంలో నిమగ్నమైన ఈయన వ్యక్తిత్వం ఆదర్శప్రాయమైంది. నైతికమైన విలువలతో ఆదరణీయమైంది.

వ్యక్తి పరమైన అంశానికి వస్తే ఈయనలో ఉన్నత శ్రేణికి చెందిన సూక్ష్మమైన స్పందన గుణం, సున్నితమైన మనోరూపమూ కన్పిస్తాయి. రచయిత కపసరమైన ఈ లక్షణమే నెహ్రూను రచయితగా బాగా ప్రకాశింపజేసింది. రచనా శక్తికి దోహదం చేసింది 1954లో అవతరించిన కేంద్ర సాహిత్య ఎకాడమీ మొదటి చైర్మన్ (ఆతరువాత అధ్యక్షుడు) నెహ్రూయే. ఒక సందర్భంలో 27 ఫిబ్రవరి 1955న మాట్లాడుతూ "As I am president of Academy I may tell you quiet frankly, i would not like the prime-minister to interfere with the work of Academy" అన్న మాటల్లో సాహిత్యం కళా రంగాల్లో స్వేచ్ఛను కోరే, ప్రధామంత్రి వ్యక్తిత్వం మనల్ని ఆకట్టుకుంటుంది. ప్రజాస్వామ్యంలో రచయితపై రచనలపై నియమనిబంధనలు సృజనాత్మక శక్తిని కుంటుపరుస్తాయని ఈయన నమ్మకం. సాహిత్య ఎకాడమీ సమావేశాలకు తప్పనిసరిగా హాజరయ్యేవాడు. అందరి అభిప్రాయాలూ శ్రద్ధగా వినేవాడు, మన్నించేవాడు. ఆయన స్వయంగా గొప్ప రచయిత కావడంవల్ల రచయితల మధ్య

ఎకాడమీ అనుబంధం ఎంతో రాణించింది. నెహ్రూ మాటల్లో "రచయిత చెప్పదలచుకుంగి ధైర్యంగా చెప్పాలి ఏ విధమైన భయంతోను వ్రాయకూడదు ". విజ్ఞానశాస్త్రం మొదలు సాహిత్యం దాకా పంచవర్ష ప్రణాళికల నుండి దేశ రక్షణ, యంత్ర పరిశ్రమలదాకా అనేక వ్యవస్థలకు రూపకల్పన చేసిన పరిపాలనా దక్షుడు.

నెహ్రూ తాను విశ్వసించిన సిద్ధాంతాల్ని స్వేచ్ఛగా ప్రకటించే ధైర్యంగల ప్రజాస్వామ్యవాది. జాతీయాం తర్జాతీయ క్షేత్రానల్లో ప్రతి సమస్యకూ వెంటనే స్పందించే చైతన్యమూర్తి.

జాతి సమగ్ర వికాసానికి ఏకాంత ధోరణి పనికిరాదు. బయటి ప్రపంచంలో స్నేహ సంబంధాలు అవసరం. తన దేశం ప్రయోజనాలకు భంగం కలగని విధంగ ప్రపంచ సమస్యల్ని ఎదుర్కొనే వాడు. దేశాలమధ్య జాతులమధ్య పోరాటలు ముఖ్యంకాదు. కలహాలకు స్వస్తి చెప్పాలి. నాగరిక సమాజానికి తగిన విధంగా సర్దుబాటు ధోరణితో వ్యవహారించాలి ఇది ఆయన లక్ష్యం.

తెలుగు సాహిత్యంలో స్వేచ్ఛా కవిత్వంలో నెహ్రూ వ్యక్తిత్వ ప్రభావం పరిశీలకుల దృష్టికి రాకమానదు. నెహ్రూ అనంతరం ప్రజాస్వామ్యమూ జాతీయ సమైక్యత ఎన్నో పరీక్షలకు గురియైంది. తెలుగులో స్వేచ్ఛా కవిత్వం పై ఈ స్థితి ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రభావాన్ని నెరపింది.



సాహిత్య వీథి

# జానపద గేయాలు - వైవాహికాచారం

- బి.వి. యస్ సత్యనారాయణ

మానవుని మనుగడకు నాలుగు ఆశ్రమాలను విధించిన పెద్దలు గృహస్థాశ్రమమునుఎంతో ప్రాధాన్యత కలదిగా పేర్కొన్నారు. ఈ గృహ స్థాశ్రమం ప్రారంభమయేది వివాహంతోనే. అందువల్ల మానవజీవితానికి ముఖ్యమైనది గాను, మానవ సమాజం మనుగడకు అవసరమైనదిగానూ వివాహం ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. వివాహమనేది మానవునిజీవయాత్రకు నాంది వంటిది. ఇది స్త్రీ పురుషుల్ని కలిపే సంస్థ కాదు, రెండు కుటుంబాలను సంధానపరిచే సంస్థ అని భావించవచ్చు. అని జాన్సన్ హీరీ అను సంఘ శాస్త్రజ్ఞుడు (సోషియాలజిస్టు) వివరించారు. వివాహం రెండు నిండు హృదయాల కలయిక. రెండు పవిత్ర ప్రణయానురాగాల అల్లిక. అది నిండు నూరేళ్ళపంట. అందుకే ప్రత్యేకాచారంగా వివాహం రూపుదిద్దుకొంది.

జానపదులు వివాహాన్ని అతి ముఖ్య ఘట్టంగా భావించారు. జానపద సాహిత్యంలో వివాహానికి సంబంధించిన పాటలెన్నో ఉన్నాయి. పెళ్ళికి కన్య నడిగినది మొదలు కన్య నత్తవారింటికి పంపేవరకూ నడిచే వివాహ కార్యక్రమంలో ప్రతి ఘట్టానికి సంబంధించి జానపదులు పాటలు పాడుతూండటం జరుగుతుండేది. ఇవి వీనుల విందుగానూ, వధూవరుల మధ్యబాంధవ్యాలను పెంపొందించేవిగాను రెండు కుటుంబాల మధ్య బంధుత్వాన్ని పెనవేసే వారధులుగాను ఉంటాయి.

పెళ్ళికొడుకు తల్లి దండ్రులు పిల్లనిమ్మని పెళ్ళికుమార్తె తల్లిదండ్రులనడగడం జానపదుల ఆచారం. వరుని అర్హతలు, ఆస్తి పాస్తులు మొదలైన వివరాలన్నీ తెలియజేసి, కన్యనడుగుతుంటారు. కన్యతల్లి దండ్రులు, తమ కుమార్తెకు తగిన వరుడని భావించి నట్లయితే తమ అంగీకారాన్ని తెలిపి, వియ్యమందడానికి సిద్ధపడతారు. లేకపోతే, వారిఅయిష్టతను తెలియజేస్తారు. పెళ్ళి సబంధం కుదిరి, పెళ్ళి వేడుకలు ప్రారంభమయినపుడు పాడే పాటలు, ఆవేడుకల్ని మరింత యినుమడింపచేస్తాయి.

అల్ల ఊరివారు పిల్ల నడిగేరు
పిల్లవానికి రూపురేకలున్నాయి
ఏటేట పండేటి భూములన్నాయి
ఊరి పొలిమేరలో తోటలున్నాయి
చుట్టు కొల్లారంపు మిద్దెలున్నాయి
కుర్రవానికి మంచి సేద్య మున్నాది
పిల్ల దానికి తగిన ఈడు జోడేను
కన్నెనిస్తామని కబురంపుదాము
అల్లఊరివారు పిల్లనడిగేరు
ఇల్లలికి ముగ్గెట్టి పెళ్ళి సేతాము

స్త్రీలు ఈ పాట పాడుతూ ఉంటే, పెళ్ళికొడుకు పెదవులపై చిరుదరహాసం, పెళ్ళి కుమార్తె వదనంలో సిగ్గు దొంతరలు కురిసి, అందరి మనసుల్ని మురిపిస్తాయి.

వివాహ వేడుకల్లో వధూవరుల్ని పీటలమీద కూర్చోబెట్టి కొట్నాలు దంచడం ఒక వేడుక. ఆ వేదికలో వరుణ్ణి శ్రీరాముడుగాను, వధువును సీతాదేవిగాను వర్ణిస్తూ పాటలు పాడుతూ ఉంటే, ఆ వధూవరులిద్దరు తమను

గవరపాలెం, అనకాపల్లి, దిబ్బవీధి.

పురాణ పురుషులుగా భావిస్తూ ఆనంద తరంగాల్లో తేలియాడుతూ ఉంటారు. కొట్నాలు దంచేటపుడు పాడే పాట.

"సువ్వి సువ్వి రామచంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి సీతమ్మ మాకు శుభము లిమ్ము
మోదమునను పెండ్లి పీటమీద శ్రీరాము సరస
ఆదిలక్ష్మియైన సీతమ్మను నిల్పిరీ ॥సువ్వి॥
వాటమైన కుందనంపు
మేటి కుందెయందునిల్పి
గాటమైన పసిడి రోకళ్ళు పట్టుక ॥సువ్వి॥
రాజనములు యిప్పపువ్వు
రాజనములు మంచి పునుగు
మేలుకొండ రాజనములు మేలువంకెలూ॥సువ్వి॥
కుందియందు నిండనుంచి
కొట్నములు దంచిరపుడు
కుందరదన లెల్ల నవ్వుకొనుచు బెలగుచు ॥సువ్వి॥

పెళ్ళి వేడుకను ఎంతో ఆనందంతో గడుపుతుంటారు. పెళ్ళి వేడుకను తెలిపే పెళ్ళి సమయం పాటలు ఎన్నో ఉన్నాయి. అవి పాడుకొంటూ జానపదులు పెళ్ళి సంబరాలు జరుపుక్కొంటారు. ఉదహారణకి ఒకపాట.

ఆనందమానంద మాయెనూ - మా
సీతమ్మ పెళ్ళి కూతురాయెనూ - మా
రాముడు పెళ్ళికొడుకాయెనూ - జను
లందరి కానంద మాయెనూ.

పెళ్లిసమయంలో పాడే పాటలు వధూవరులిద్దరి కలయికలో ఆనందామృత రసగుళికలు. ముసిముసి నవ్వులతో చూపులు కలుపుకొనడానికి ఉపకరించే ప్రణాళికలు. వారి ఆనందానికి పూలబాటలు.

పెళ్ళిలో వరునికి నలుగు పెట్టే సమయంలో పాడే పాటలు.

నలుగూకు లేచిరారా
రాజ గోపాలుడా
యశోద బాలుడా
అంత చలమేలరా ॥నలుగూకు॥
గంజాయి దూదిలో
కనక మెత్తాజేసి
పట్టుపరచినానురా ॥నలుగూకు॥
నలుగు పెట్టే వేళరా జాలమేల
బాలకృష్ణ బాణకాదు బాలికా
గంధము మే నలదరా
యిందువదన జవ్వాది బూయరా
నంద తనయ సుందరాంగ
యిందుకువాదేలరా ॥నలుగూకు॥
సిగను పూలు జుట్టరా
సఖియను చెయి బట్టరా
అఖిలాండ కోటి నాయకా
శుభమున దయ జూడరా ॥నలుగూకు॥

అదే విధంగా వధువుకి నలుగు పెట్టే సమయంలో పాడేపాట చూడండి.

వనజాక్షి వేగ రావే
వనితరో నలుగుకిపుడు
లోణి చీరగట్టి
రంగైన రవిక తొడిగి
లావణ్యముగ నీవు

రమణిరో నలుగు కిపుడు ॥వనజాక్షి॥

కమ్మని కస్తూరి నొసట

తిలకములే దిద్ది

హెచ్చయిన జాజి విరులు

కొప్పున తురిమి వేగ ॥వనజాక్షి॥

గజ్జలందియలును

ఘల్లుఘల్లున నడపులతో

వయ్యారి నడపులతో

వెలదిరో నలుగుకిపుడు ॥వనజాక్షి॥

వాసిగ మనవూరి

చంద్రుడు లేచి నాడమ్మ

కామినీ మణి వేగ

పీటకు లేచిరావమ్మ ॥వనజాక్షి॥

నలుగుపెట్టే సమయంలో పాడే పాటలు వధూవరుల్ని జీవితంలో మధురమైన మదన సామ్రాజ్య పట్టం కడతాయి. దాంపత్య జీవితానికి ప్రధమ సోపానాలవుతాయి. వధూవరుల హృదయాల్లో పరస్పర అనురాగం అంకురింపచేస్తాయి. అదే వారి భావి జీవితానికి బీజమవుతుంది.

పెళ్ళి జరిగిన పిదప పూలబంతులాట వధూవరుల్ని శృంగార సామ్రాజ్యానికి పట్టాభిషేకం కట్టే సమయం. అది ఎంతో సున్నితమైనది. విలువైనది. మధురాతి మధురమైనది. ఈ సందర్భాన్ని కూడా జానపదులు మధురమైన గీతాలతో ముంచేసారు.

పూలబంతులాడేనే

బాల రుక్మిణి కృష్ణులు

సొంపైన బంగారపు

మేడలోపల నేడు ॥పూలబంతు॥

చాల సంతసముగా

నీలవేణు లెల్లచూడ

భేరీ మృదంగములు

భోరున మ్రోయగ ॥పూలబంతు॥

వర కామిను లెల్ల

వచ్చి నాట్యములు సేయ

విరజాజులు మెల్లలు

నరసిజ సుమములు ॥పూలబంతు॥

పెళ్ళివేడుకలు పూర్తి కాగానే మొదలయ్యేది విందుభోజనాలు. అదే బువ్వంబంతి. ఈ బువ్వబంతి సందర్భంలో కూడా జానపదగీతాలు వెలిశాయి. వధూవరులు బంధువులతో కలిసి భోజనం చేయడం వల్ల వారి మధ్య సాన్నిహిత్యాన్ని పెంపొందిస్తుంది. వారిలో బిడియం తొలగి పోవడానికి దోహదం చేస్తుంది. అందుకే బువ్వంబంతి మరియు గీతాలు. బువ్వబంతికి సంబంధించిన పాట.

చూడనెంతో శృంగారము

సుదతీరో సీతారామచంద్రుల బువ్వము

॥చూడనెంతో॥

హెచ్చైన అరిటాకులె

తెచ్చి వేసి నారట

చెప్ప శక్యము గాదటె

చెలియరో వినవే

సన్నబియ్య పన్నమట

వన్నె మీర సూపమట

ఎన్నో ఎన్నో కూరలట

కన్నెరో వినవే

వడలంటె వడలట

కదలేని వరోళీలట
నడుమ నడుమన మండిహల్
మందయాన వినవే ॥చూడనెంతో॥

పెళ్లికార్యక్రమం పూర్తయ్యాక, వధువును అత్తవారింటి కంపండం కరుణారసపూరిత సన్నివేశం, ఇన్నాళ్ళూ పుట్టి పెరిగిన ప్రదేశాన్ని, కన్న తల్లిదండ్రులను, ఆత్మీయులను, స్నేహితురాళ్ళను విడిచి పెట్టి, ఒక క్రొత్త ప్రదేశానికి, క్రొత్త వాతావరణంలోకి కొంగ్రొత్త బాధ్యతల్ని మోయడానికి క్రొత్త అనుబంధాలను పంచుకొడానికి వధువు పయనం సాగే సంఘటన. ఇది వధువుకీ, ఆమె తరపు వారికీ బాధాకరమైన సంఘటన. అందిరి నయనాలు ఆ సందర్భంలో అశృజలపూరితాలు కాక మానవు. ఆ సమయంలో వధువు తల్లి దండ్రులు, తమ కుమార్తె అత్తమామలకు, ఆడబడుచులకు, తోడికోడళ్ళకు అప్పగింతలు చెపుతుంటారు. ఈ అప్పగింతలు బంధాలు గట్టిపడాలని, అత్తాకోడళ్ళ మధ్య విభేదాలు రాకుండా ఉండాలని, వదినా మరదళ్ళ మధ్య భేదాభిప్రాయాలు రాకుండా ఉండాలని, తోడికోడళ్ళ మధ్య పొరపొచ్చాలు రాకుండా ఉండాలని చెపుతుంటారు. అప్పుడే తమ కుమార్తె కాపురం సజావుగా సాగుతుందని ఆ తల్లి దండ్రుల ఆశ. అందుకే జానపదులు ఈ సందర్భానికి అనుగుణంగా అనేక గేయాలు కూర్చి, జానపదుల గుండెల్ని రసవంతం చేసారు. మచ్చుకి ఒకటి

లక్ష్మి కళ్యాణమే వైభోగమే
గౌరి కళ్యాణమే సౌభాగ్యమే
వదినెరో మా బాల నిదె నప్పగింతు
సదయవై గైకొమ్మ సరగు నారమ్మా
ఎన్నో నోములు నోచి కన్నాము దీని
కన్నులలో పెంచుకొన్నాము తల్లి ॥లక్ష్మి॥
మీ పట్టి గాని యిక మాపట్టిగాదు
చేపట్టి రక్షించు చేతమ్రొక్కెదము
నీలవేణిరో దీని నీటముంచెదవో
పాలముంచెదవో నీ పాలవైచితిని
పనులేమి నేర దీ పసిబాల యబల
కనినబిడ్డగ నేర్పి కాపుమోయమ్మ
కోడలు కాదిది కూతురే యనుచు
పాడియైన దయతో గాపాడి రక్షించు
చిన్న కన్నియను నేనిన్నాళ్ళు పెంచి
నీచేత బెట్టితి, నీ కొప్పగిస్తి
ఇంటిలో నా యీ చిట్టి పట్టిని విడిచి
యెట్లు జీవింతునో యీశున కెరుక
పొరుగింటి నాడుకో బోయిన యపుడు
తిరిగి వొచ్చిన ఆశ దిగులొందు చుండు
ఒక గడియ నన్విడచి తానుండ లేదు
యిక మీద కాపురము ఎట్లు చేసెడిదో
లక్ష్మి కళ్యాణమేవైభోగమే
గౌరి కళ్యాణమే సౌభాగ్యమే

ఈ పాట నవ వధువుకి మానసికధైర్యాన్నిస్తుంది. క్రొత్త ప్రదేశాలకి వెళ్ళి, క్రొత్త మనుష్యుల మధ్య మసలుకో బోయే ముందు బెరుకు తగ్గుతుంది. క్రొత్తగా వెళుతున్న ప్రదేశం నాది, ఆ మనుషులు నావాళ్ళు అన్న భావన మనసులో నాటుకొనడానికి ఎంతగానో తోడ్పడతాయి. మగువ మనసు అత్తగారింట స్థిరపడే వరకు ఇటువంటి గీతాలు మనోబలాన్ని చూపిస్తూనే ఉంటాయి. ప్రతి అత్తిమామలు తమ కోడళ్లని ఎలా చూసుకోవాలో ఇటువంటిపాటల్ని బట్టి గ్రహిస్తారు.

కొండల్లో పుట్టిన నది దూకుతూ కోనల్లో దూసుకొంటూ ప్రవహిస్తుంది. చివరకు సముద్రంలో కలుస్తుంది. సాగర సంగమం జరిగేటప్పుడు. ప్రసముద్రం

లోంచి వచ్చే ఆటుపోట్లను తట్టుకొనవలసి వస్తుంది. ప్రతి స్త్రీకి అత్తింటి వారితో కలిసే విధానం సాగర సంగమం లాంటిదే. అందుకే నదికీ వదువుకీ అటుపోట్లు తప్పవేమో! కొడుకు చెడుగైన తండ్రి తప్పు, కూతురు చెడుగైన తల్లితప్పు. అని జాన పదులు భావిస్తారు. అందుకే ప్రతి తల్లి తమ కూతురు వివాహమైన తర్వాత అత్తింట మసలుకోవలసిన పద్ధతిని ఉపదేశిస్తుంది.

సెలవిచ్చి మాయమ్మ సెలవిచ్చి నామమ్మా
చెలగి మీ అత్తింట్లో బుద్ధిగ నుండమ్మా
యెవ్వరే మాడిన ఎదురాడకమ్మా
వీధిలో నిలుచుండి కురు లిప్పకమ్మా
పలుమారు పలుదెరచి నవ్వబోకమ్మ
పరమాత్ముతో గూడి వెలుగు మాయమ్మ
వార్ని కాదని పువులు ముడువ బోకమ్మ
పెద్దల గురుతెరిగి నుడువు మాయమ్మ
నాతోటి చేసిన మంకుపేరెల్లా
మెరుగక అత్తింట్లో చేయబోకమ్మ
అత్తమ్మకెన్నడు యెదురాడకమ్మ
ఇన్నాళ్ళువలె కోపముంచ బోకమ్మా
నీవు యేమన్నాను మేము విన్నాము
అత్తవారింట యేమనబోకు మమ్మ
అడకువతో అందరితో మెలగి రావమ్మ

ఇదే భావాన్ని తెలిపే పాటలు అనేకం ఉన్నాయి. అయినప్పటికీ ఏపాట అయినా రసవత్తరంగా ఉండి వినాలనే కుతుహలాన్ని కలిగిస్తుంది.

సీతారాములు పురాణ పురుషులు. భగవత్ స్వరూపులు. జానపదులు వివాహ సంబంధ గేయాలలో ఎక్కువగా వధూవరులను సీతారాములుగా వర్ణిస్తారు. వధూవరులు ఆ పాటలను తమకే అన్వయించుకొని, సీతారాములమన్న భావనతో మురిసిపోతారు. సీతారాముల ఆదర్శదాంపత్య జీవితాన్ని తాము అనుసరించడానికి పునాదులు వేసుకొంటారు. అది సంఘ శ్రేయస్సుకే దారితీసే భావమని చెప్పుకోవచ్చు. అది జానపద గీతాల మహిమయే.



# చలం సావిత్రి

- నడిమింటి విజయలక్ష్మి

పంచమవేదంగా ప్రసిద్ధిచెందిన మహాభారతం అరణ్యపర్వంలో ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱనార్యుడు చెప్పిన సావిత్రి కథ జగత్ప్రసిద్ధమయినది. ఆ దేశ కాల పరిస్థితులలో ఆ సావిత్రి అద్భుత విప్లవకారిణి అని చెప్పవచ్చు. రాజ్యాధినేతలు, సకలైశ్వర్య సంపన్నులు, కులవయోరూప విలసితులు అయిన రాజకుమారుల నెందరినో కాదని, రాజ్యభ్రష్టుడు, నిత్యదరిద్రుడు, అల్పాయుష్కుడు అయిన సత్యవంతుణ్ణి వరించింది. తన పాతివ్రత్యంతో అతణ్ణి మృత్యువునించి విడిపించడమే కాకుండా, అత్తమామలకు దృష్టిని, రాజ్యాన్ని, తండ్రికి పుత్రశతాన్ని కూడా సాధించింది. ఆత్మవిశ్వాసం, దృఢ సంకల్పం వుండాలేకాని స్త్రీలు సాధించలేనిది లేదు అని ఆనాటి కవులు కూడా అన్యాపదేశంగా చెప్పేరు. అయితే ఆ వ్రాతలకి వక్రభాష్యాలు చెప్పి, పాతివ్రత్యానికి పెడర్థాలు కల్పించి, పురాణాల్ని భ్రష్టుపట్టించిన సనాతన వాదులకి చెంపపెట్టు చలంగారి సావిత్రి.

ఈ సావిత్రి ప్రేమతత్వాన్ని కూలంకషంగా అర్థం చేసుకున్నది. అర్థం చేసుకున్న దాన్ని నిర్భయంగా ఆచరించి విధికి కూడా విధిలేక తలవంచవలసిన పరిస్థితి కల్పించింది. సహజము, స్వచ్ఛము, సత్యము అయిన ప్రేమ విధినిషేధాలకు లొంగనిది, మరణం లేనిది, ఏ మలినాలు అంటనిది, ఏ పరీక్షలనైనా యెదుర్కొనేది. అటువంటి ప్రేమ స్త్రీ పురుషుల జన్మహక్కు, ఆ ప్రేమకి విపత్తులు కల్పించి, చంపబూనుకొంటుంది యీ సమాజం. సంరక్షణపేరుతో, ధర్మాచరణ నెపంతో అమూల్యమైన ప్రేమకి మరణం లేదని నిరూపించాలంటే అందుకుతగిన త్యాగం చెయ్యడానికి సిద్ధపడాలి. తను అపురూపంగా దాచుకున్న నిధులు పరువు ప్రతిష్టలు, ఆఖరికి శీలాన్నైనా త్యాగంచేసి సృష్టికే ప్రాణమైన ప్రేమని రక్షించుకోవాలన్నది యీ సావిత్ర తత్వం. పాతివ్రత్యానికి కొత్త భాష్యం చెప్పింది. బాహ్యరూపగుణ బలసంపదల కతీతమై మనిషిలో ఆ మనిషి నంటని ప్రాణదీపంతో సమానంగా వెలిగేది ప్రేమ దీపం. ఆ దీపం జ్వాజ్వల్యమానంగా వెలగాలంటే మనిషి తన సర్వశక్తుల్నీ చమురుగా ధారపొయ్యాలి. అదే యీ సావిత్రి చేసింది.

బుధవారం పొద్దున్న 7 గంటల సమయంలో సూచనతో యీ నాటకం ప్రారంభమవుతుంది. 8 రంగాలు గల యిది గురువారం రాత్రి పదిగంటల సమయ సూచనతో ముగుస్తుంది. ఈ యెనిమిది రంగాలలో సావిత్రి ప్రణయ విశ్వరూప సందర్శన చేస్తారు. ప్రేక్షకులు.

ఒకటోరంగంలో సత్యవంతుణ్ణి ఆధునిక నాటకాల్లో నాయకుడి వేషంలో యిరవై అయిదేళ్ళ యువకుడిగా పరిచయం చెయ్యడం జరిగింది. సావిత్రి యిరవై మూడేళ్ళ యువతిగా చెప్పబడింది. తొలిచూపులోనే పరస్పరాకర్షితులై తమ ప్రణయం జన్మాంతర సంబంధమని వారు నమ్ముతారు. అందుకే సత్యవంతుడు సావిత్రి పేరుచెప్పగానే "నాకు తెలుసు సావిత్రి!... యీ పేరు నా హృదయంలో గానం చేస్తోంది.' అంటాడు. ఇందులోనే సావిత్రి విప్లవ తత్వం పరిచయం అవుతుంది. తానెవరికోసం వుద్యాన వనంలో కొచ్చిందో చెప్పే సందర్భంలో "నాకోసం మావాళ్ళు వరించి కట్టడం న్యాయమనుకున్న వాణ్ణి" అంటుంది. సత్యవంతుణ్ణే వరించి తన వరణ స్వాతంత్ర్యం

20-2-33, సంఘమిత్రలంక వీధి, పాతరామమందిరంవద్ద, విజయనగరం.

ప్రకటించింది. అది ప్రేరణగా సత్యవంతుడు కూడా తనను పెళ్ళి చేసుకోవద్దన్న పెద్దల మాట ధిక్కరించి సావిత్రిని చేపట్టేడు.

ఈ వుపద్రవంనించి తప్పించడానికి సావిత్రి తండ్రి అశ్వపతి సావిత్రితో నిన్ను భర్తగా తాకితే సత్యవంతుడు మృతిచెందుతాడు. "అని బెదిరిస్తాడు. తండ్రిగా తనకు విధేయత చూపించాలన్నదానికి" నేనిప్పటికే సత్యవంతుడి పత్నిని. అంటూ వివాహిత అయిన స్త్రీకి తండ్రిపట్ల విధేయతకంటె భర్తననుసరిచండమే ధర్మమని చెప్పే పెద్దల మాట వారికే అప్పజెప్పడం గమనించవలననది.

రెండోరంగంలో ప్రేమకి ఐం[illegible] సత్యవంతుణ్ణి విడిపిస్తుంది.

మూడో రంగంలో మరణోణ్ముఖుడయిన సత్యవంతుని, మరణం నించి తప్పించడానికి మార్గాన్వేషణ చేస్తున్న సావిత్రి కనిపిస్తుంది. మొదటిరంగంలో ప్రకృతి వుల్లాసభరితంగా వుంటే యీ రంగంలో ప్రకృతి నిశ్శబ్దంగా, గంభీరంగా వర్ణించబడింది. "తుమ్మెదలు పువ్వులమీద వాలి నిద్రపోతున్నాయి. జముడుకాకి మూలుగుతోంది. గాలి బిగబట్టింది. అంటూ ప్రకృతికి, ప్రణయానికి వున్న అవినాభావ సంబంధం సూచించబడింది.

ఆ నిశ్శబ్ద నీరవ ప్రకృతిలో సావిత్రి వొంటరిగా తనకి తను ధైర్యం చెప్పుకుంటూ, శపథాలు చేసి, మనోబలాన్ని కూడగట్టుకొని కర్తవ్యోన్ముఖురాలవుతుంది. "నాహృదయావేశం, జీవనరక్తం నీలో ప్రవేశపెడతాను, ఏడులోకాలు దాటించి తప్పించి, పద్నాలుగు సముద్రాల క్రిందదాచినా, నిన్ను మళ్ళీ తెచ్చుకుంటాను. నాకొనవూపిరి తోనైనా నీలో ప్రాణం ప్రతిష్టిస్తాను...." అన్న సావిత్రి ఆత్మవిశ్వాసాన్ని మహిళాలోకం మరీ మరీ మననం చేసుకొవాలి. అంతేకాదు ఇది మృత్యువే అయినా సమస్త జీవనాధారమైన ప్రణయాన్ని నిగ్గుతీసి, కేంద్రీకరింపజేసి, మృత్యువుచే నవజీవనం త్రాగించి హాలాహలాన్ని అమృతంగా మారుస్తాను అంటుంది ఎంత కష్మాన్ని నమ్మకమది!

"ప్రేమిస్తున్న హృదయం వొకటి యెండి శూన్యమయిందంటే ప్రేమవల్ల జనించి, వృద్ధిపొంది, ప్రేమే ఆధారంగ నిలిచివుంటే చండ తేజశ్శృంఖలాలైన బ్రహ్మాండాలతో సహా యీ ప్రపంచమంతా శూన్య మవుతుంది. అంటూ సమస్త ప్రకృతిలో జీవచైతన్యం, వికాసం చచ్చిపోయి, నిస్తేజమయిపోతుందంటుంది ఈ క్రూర హత్యచేసిన చేతులతో జగత్కర్త సృష్టికార్యం యెట్లా ఆరంభిస్తాడని"? నిలదీస్తుంది.

సావిత్రి ప్రణయ తీవ్రతకి యమధర్మరాజు సైతం స్పందించి యెనిమిది ఝాముల గడువిచ్చాడు. సావిత్రి విజయపరంపరలో అతి ముఖ్యమైనదది.

నాలుగోరంగంలో స్వచ్ఛము, తీవ్రము అయిన సావిత్రి ప్రణయాన్ని కల్తీ చేసిగాని తనపని సా[illegible]వేననే భయం యమధర్మరాజుకి కలిగి చంద్రికను ప్రవే[illegible], తనమాయ ప్రయోగించి సత్యవంతుడికి. చంద్రిక సాన్నిహిత్యం కల్పించి సావిత్రికంట పడేటట్టు చేస్తాడు. ఒక్కక్షణం తడబడినా యుక్తాయుక్త వివేకజ్ఞానంతో సత్యవంతుణ్ణి క్షమించి స్వీకరిస్తుంది. ఇందులో సమాజంలోని యువతీ యువకులకొక సందేశం వుంది. స్థిరమైన వారి ప్రణయంలో అప్పుడప్పుడు యిలాంటి గండాలెదురైనా, అది క్షణికమని గ్రహించితే శాశ్వతమైన ఆనందానుభూతి పొందగలరన్నాడు. సావిత్రికి ప్రేమ పట్ల యెంత గాఢ విశ్వాసమో! "నేను ప్రేమించేది నిన్ను! నిన్నే! ఏ మార్పురాని, యేమార్పూ రావడం - అసంభవమైన నిన్ను! అన్నది. ఈ మాటల ద్వారా చలం ప్రేమించడం అనే భావన యెంత మహోన్నతమైనదో, చెప్పినట్లనిపిస్తుంది. మానవ సరోవరంలా నిశ్చలమైన, నిర్మలమైన ప్రేమమూర్తి సావిత్రిముందు చంద్రిక సైతం మోకరిల్లుతుంది. యమధర్మరాజుకి కూడా సావిత్రి పట్ల జాలి మొదలవుతుంది.

ఆ జాలిని ప్రక్కకునెట్టి మాయా సత్యవంతుడిగా మారి, అసూయ పట్టించే మాటలాడి యెలాగైనా ఆమెని వంచాలని విఫల ప్రయత్నం చేస్తాడు యముడు.

ఏడో రంగంలో నిర్జీవంగా నిస్తేజంగా కనిపించిన సత్యవంతుణ్ణి చూసి సహించలేని సావిత్రి యెలాగైనా అతణ్ణి పూర్వపు సత్యవంతుణ్ణి చేయమని యుముణ్ణి బ్రతిమాలుతుంది. అయితే యమధర్మరాజు అక్కడ పక్కా వ్యాపార ఫక్కీలో సత్యవంతుణ్ణి బ్రతికించాలంటే తను తన ఆయుష్షులో భాగం, తపఃఫలం, జీవశక్తి త్యాగం చెయ్యవలసి వుంటుందనీ యేలాభం లేని యీ పనికిమాలిన త్యాగం యెందుకు చెయ్యాలి? అంటాడు.

అప్పుడు అతడి ప్రశ్నలో న్యాయం గ్రహించిన సావిత్రి యెంత విలువైనదైనా, యెంత గొప్పదైనా. అతడు కోరిన దతడికిచ్చి సత్యవంతుణ్ణి పునర్జీవితుడుగా చెయ్యడం తన ధర్మమనుకొని యేంకావాలో? అడగమంటుంది. సావిత్రి నిజాయితీ చూచిన ధర్మదేవతయిన యముడు కూడ తన తపస్సు ధారపోసి. నియమాలకు నీళ్ళువదిలి యివ్వడానికి సిద్ధపడ్డ సత్యవంతుడి ప్రాణంమూల్యం సావిత్రితో వొక రాత్రి అనుభవం అంటాడు. సావిత్రి నిర్ణయం ఆమె ప్రేమకి పరాకాష్ఠ. మీరు ప్రాణమిస్తే నేను మానమివ్వాలి యితనికోసం. అంతేనా? అని అతి తేలిగ్గా సమాధానమిస్తుంది. ప్రేమా? పాతివ్రత్యమా? దేనికోసం యేది వదులుకోవాలి? అని తేల్చుకోవలసి వచ్చినప్పుడు ప్రేమకొసం పాతివ్రత్యం వదులు కోవడమే త్యాగం, అని చెప్పగలిగే సాహసం, గుండెబలం చలంకి తప్ప యింకెవరికుంటుంది?

కాని ఏకనిష్ఠ ప్రేమ రసాభాసమనే పూర్వ కవుల వాదన చలం వొప్పుకుంటాడు. అదే సావిత్రి చేత యముడికి చెప్పిస్తాడు. అతడు మొండిగా తనపట్టు సడలించడు. సరేనని సమ్మతిస్తుంది. సత్యవంతుణ్ణి బ్రతికించుకుంటుంది. మాటల సందర్భంలో యముడు యెంతత్యాగం చేసి సత్యవంతుడికి జీవితం ప్రసాదించాడో చెప్తుంది. అతడికి అంత కరుణ యెలా కలిగిందంటే తన మీద మోహం వల్ల అని నిస్సంకోచంగా చెప్తుంది. సావిత్రి నిజాయితీకి యింతకంటె తార్కాణం యేంకావాలి? సావిత్రికి తగిన జంట సత్యవంతుడు. అంత మోహించి కూడా తనని బ్రతికించి మళ్ళీ సావిత్రికిచ్చిన యముడి విశాల హృదయాన్ని మెచ్చుకుంటాడు. అసూయని జయించిన ప్రేమంటే అదే. తనైతే అంతత్యాగం చెయ్యలేనంటాడు. అంతటి మహనీయుడికి పాదాలమీద పడి కృతజ్ఞత లర్పించాలంటాడు. సావిత్రి ప్రేమకి యింతకంటె పాత్రత యెవరికుంటుంది? ప్రేమని నమ్మేవాళ్ళకి, లోకాన్ని జయించి యిస్తుంది ప్రేమ. అని త్రికరణ శుద్ధిగా నమ్మినవాడు. అందుకే వారి ప్రేమకి అడ్డు పడదల్చుకున్న యముణ్ణి సైతం హత్య చెయ్యాలనుకుంటుంది.

ఆమె సాహసానికి ముగ్ధుడయిన యముడు "ప్రేమ జ్యోతిని శిరస్సున ధరించి విధిని జయించింది సావిత్రి" అని డిక్లేర్ చేస్తాడు. నన్ను అట్లా చంపడానికి నిశ్చయించుకోక పోతే, ప్రేమకోసం ధర్మాన్ని కూడా త్యజించగలిగిన మహా పతివ్రత సావిత్రి యెట్లా కాగలదు? అంటాడు, ప్రేమకోసం పాపానికి వెనుదీసే ప్రేమ ప్రేమకాదనుకుంటాను" అంటాడు.

ఇలా ఆధునిక భావాలతో నిండిన పురాణ పాత్రలో మధుర ప్రణయిని, ప్రేమ తపస్విని అయిన సావిత్రి మనోభావ విశ్లేషణతో ప్రేమ ఎంత సామాన్యంగా, స్వాభివికంగా వుత్పన్నమవుతుందో మరణంలో కూడా విడదీయలేని అభేద భావాన్ని యేర్పరుస్తుందో వివరిస్తూ ఆధునికులకు ప్రేమ తత్వ స్వరూపాన్ని, దాన్ని పోల్చుకోవడానికి, నిలబెట్టుకోవడానికి తాము ఏ ఏరకమైన త్యాగాలు చెయ్యవలసి వుంటుందో విశదీకరిస్తుంది. చలంగారి సావిత్రి.

కవితా వీధి

# తుఫాన్ వార్షికోత్సవం

- కె.యస్వీ ప్రసాద్

మావవులను శాసిస్తూ జలం చేసే సైనిక కవాతుకు
తుఫాను "తీతువై" నేపథ్య సంగీతంతో సహకరిస్తుంది
నిద్రించే శ్రామికులను నిర్దయగా ముంచెత్తిన జలం
"సౌప్తికపర్వ" చరిత్రను జ్ఞప్తికి తెస్తుంది
అశ్రుధార చేరికతో జలమట్టం పెరుగుతుందని
భీతి చెందిన మనిషి, కన్నీటిని హృదయ సాగరంలో దాచుకుంటున్నాడు
అనుబంధాలకు అతీతంగా ప్రాణభీతితో చెట్టుకొకరైతే
మిధ్యాబంధాల తీరుకు జలవాహిని వేదాంతిని నిర్వేదహాసం చేస్తుంది
పల్లెలను, పంటలను కబళించిన జలరక్కసి
అధికారుల ఆవులింతల కునికిపాట్లతో కులాసా కబుర్లాడింది
దొరకని శవాలకోసం
దైన్యంగా విలపించే జీవచ్ఛవాల శ్రేణులపై
రాజకీయరాబందులు చక్రభ్రమణాలు చేస్తున్నాయి
ఓదార్పు నాటకాన్ని విజయవంతంగా ముగించి
ఓట్లన్ని మావేనని ఏ.సి,రూముల్లో "ట్రీచీర్స్" చెప్పుకుంటున్నాయి
ఆకాశం వర్షించే పులిహోర పొట్లాలు
కండగలవాడి అండలో క్షుదార్తుల ప్రేగులకు
అందని మ్రాని పండ్లై నిశ్చింతగ నిద్రపోతున్నాయి
నిరాశ్రయంగా రోదించే వ్యధిత హృదయ వ్రణాలపై
దళారి ఈగలు మూగి సహాయ బృందగానం చేస్తున్నాయి
తుఫాను మేఘాలకు పురివిప్పి నర్తించే స్వార్థమయూరాలు
మరో తుఫానుకు స్వాగత నృత్యాలు చేస్తున్నాయి
కోస్తా తీరాలకు తుఫాను కోరుకోని అతిధి
పేదరైతు స్వప్నాలకు ప్రతియేటా జలసమాధి
శాశ్వత పథకాలను ఆవిష్కరిస్తే ప్రభుత
చిరునవ్వుల వెలుగుతుంది సామాన్యుని భవిత

---

ఉప్పుగుండూరు

# మధురవాణి ఆత్మహత్య

- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

కైలాసగిరి హిమశిఖరాలపై
అప్సరస ఊర్వశి అపురూప నృత్యం తళతళలు
వెండితెర ఫైవ్‌స్టార్ హోటల్ సీన్‌లో
కళ్ళు మిరుమిట్లుగొలిపే నీ క్యాబరేడాన్సు రొమాన్సు
రసాతలంలో ధనంజయుని ముందు ఉలూచి
నాట్యభంగిమలు
రంగు రంగుల దీపాల వెలుగులో
నీ సుందర అంగాంగాల పాము మెలికలు
హొయలు బయలు
శతకోటి మన్మధుల పూలబాణాల వాడి
నీకైపు చూపుల కన్నులవేడి
లక్షలాది ప్రేక్షకలోకం ముందు సమ్మోహనాస్త్రం
పిచ్చెత్తించే నీ నర్తనం మత్తుమందు

నిన్ను గురించిన మధురోహల మంజుల భావనలన్నీ
జీవన కఠోర వాస్తవం సీలింగుఫ్యానుకు వ్రేలాడిన
నీ శవం తేలవేసిన కనుగ్రుడ్లలో ప్రతిఫలించి
క్షణంలో మహేంద్రజాలం మటుమాయం.
మా గుండెల నేలపై నీ గంతుల గజ్జెల ఘలం ఘలల
కమ్మని దిమ్మెస దెబ్బల మాయాలోకంలోంచి ఊడిపడి
అందరం నడివీధిలో పోసిన కంకర రాళ్ళగుట్ట మీద
కూలబడ్డాం
శంకర మిథ్యావాదంతో తలపడ్డాం
ఎక్కడో మా పశ్చిమ గోదావరిలో హేలాపురి
మారుమూలలో
సామాన్య సంసార సరోవరంలో
ఆకలి బురదలో
మొలకెత్తిన ఓ చిన్నమొగ్గా!
నీవు చెన్నపురికి వచ్చి
చిత్ర సీమ పంకజంగా వికసించి
కీర్తిప్రతిష్ఠలు గడించి
ధన కనక వస్తువాహనాలు సేకరించి
అభిమానుల ఆదరస్వాగతాలు స్వీకరించి
జీవన సౌఖ్యాన్వేషణలో
ప్రశాంతి గవేషణలో
పచ్చిమోసాల కాలకూట విషాన్ని సేవించి
పట్టపగలే ముకుళించావా!
ఏవీ నీ 'సిల్కు' సౌందర్య తళతళలు?
ఏవీ నీ సుందర 'స్మిత' వికసిత అధరాల మందారాల
మధురిమలు?
ఏవీ నీ మదదృక్కుల మృగమదసౌరభం కిక్కులు?
"జగన్మిథ్య, బ్రహ్మసత్యం"
శంకరా! నీవు చెప్పింది మాత్రం మాకు పరమ పథ్యం!

నెం. 40/12-7 "సౌరభ", 22 క్రాసెస్, గోవిందరాజానగర్, బెంగుళూరు-560 040

## 2

దక్షిణ భారతాన్ని ఉర్రూత లూగించిన మా ప్రియమైన
తారామణీ!
నీకైపు చూపుల వెనుక నిద్రాగతంగా కన్నీటి సముద్రాలా
వలపుల తలపులతో చూపరుల వెర్రెత్తించే
నీ వ్యాంపు నృత్యం స్వాతి మెరుపుల వెనుక
రహస్యంగా దాగిన చిమ్మచీకటి గుహలా?
లక్షలాది అభిమానులున్న నీవు
నిజ జీవితంలో ఎవ్వరూ లేని ఏకాకివా?
నీ సిరిసందల తీయని బెల్లంచుట్టూ
గుమిగూడిన చుట్టాల చీమల పుట్టలా?
ఆశ్చర్యం! ఆశ్చర్యం!
ఈ బ్రతుకే దుర్మార్గులు పన్నిన
దుశ్చర్యల ధౌరంధర్యం!
తెరమీద ఎంత తళుకు బెళుకుల
మాయా తారామణివయినా
నిజ జీవితంలో నీవు మనిషివి, మనసున్న మనిషివి
సుకుమార చంద్రకాంతం పూలరాసివి
మల్లెపూలనుకుని జిల్లేడుపూలు సిగలో
తురుముకున్నావు
క్రూర సమాజం నిలువు దోపిడీకి గురి అయ్యావు
అందరూ మోసాల గిరీశంగాళ్ళు
నక్కజిత్తుల రామప్పంతుళ్లు
పవిత్రత మడిబట్టలు కట్టుకుని
నీ నుండి దూరంగా జరిగే సౌజన్యారావులు
పురుష దురహంకారం ఇసుక తుఫానులతో
జీవితమంతా సహారాగా మారిన
ఆధునిక మధుర వాణివి నీవు!
అయినా
బ్రతుకు యుద్ధరంగంనుండి పారిపోవడం
ఆత్మహత్యే శరణ్యమనుకోవడం మాత్రం
నిన్ను ఆరాధిస్తున్న వేనవేల చూపుల పూలవనాలమీద
అశనిపాతం!
అసంఖ్యాక అభిమానుల హిరోషిమా నాగసాకీల మీద
ఆటంబాంబు!

కరెంటు పోయింది
క్యాబరే మధ్యలో ఆగిపోయింది
'డామిట్! కథ అడ్డ తిరిగింది'

ఎక్కడో
చీకటి బావిలోంచి
మరణ వేదనలా
ఒక కపిలపాట
కాలపురుష విషాద నాయకుని నోట
"మిద్దె మీదా జిల్లెడాలూ
మల్లెలంటని ముడుసుకొంటీ
మల్లెలే జిల్లేడు లాయే
మనసు రెండూ విధములాయే!"

*(చలన చిత్రనటి 'సిల్క్‌స్మిత' ఆత్మహత్యావార్త విని)*

# స్నేహజీవి

- కనపర్తి రామచంద్రాచార్యులు

కందిపోయిన దాని 'బుగ్గ'ను
కొంచెం నిమిరి చూడు ఎట్లున్నదో
దాని ఒళ్లెంత కాలిపోతుందో తెలుస్తుంది।
ఏదో ఇంత 'స్నేహం' అందించామన్న
కృతజ్ఞతా భావం తప్ప తన తనువు 'జ్వలిస్తు'న్నా
ఇతరుల కెవ్వరు వెలుగుల్ని పంచుతారు?
వేలెడు వత్తివేసి,
దోసెడు నూనెపోసి,
ఓ చిన్న పుల్ల గీసి
'తలకొఁజీవి' పెట్టితే
తనకు సేవచేసిన మనిషి పట్ల కృతజ్ఞత వెల్లి విరుస్తుంది
ఆ సహృదయత మనుషులకుందా అనిపిస్తుంది!!
ఇంకా నాకు బాగా జ్ఞాపకం
చిన్నప్పుడు
పొద్దుగూకిందంటే దీనిచుట్టూ కూర్చునేవాళ్ళం,
దీని వెలులోనే తెలుగు పద్యాలు వల్లె వేసుకొనే వాళ్ళం,
మాయింట్లో ఏ కార్యం జరిగినా
ఇదే మాకు పెద్ద వెలుగు!
అదేమి జన్మోకాని, కాంతి ధారలుతప్ప
కన్నీటి చారలు దానికి తెలియనే తెలియవు!
"వాసాంసి జీర్ణాని యథావిహాయ" అన్నట్లు
ఇప్పటికి ఎన్ని వత్తులు మార్చు కొందోకాని,
'విద్యుదీప సుందరి రాకముందు నుంచి
ఇది మాతో స్నేహ జీవనం చేస్తున్నది!
వెలిగినంత సేపూ వెలిగి మలిగి
చీకటి బ్రతుకులకు వెలుగు దారి చూపి
'శిలువ' వెక్కిన 'ఏసులా' కన్పిస్తుంది

ఇ.నెం. 7-3-66, పాతగంజువీధి, సిద్ధిపేట - 502 103

# ఆనంద దీపావళి

- ఏ. శశాంకమౌళి,

ఆ రోజు కొందరికే
ఆనంద దీపావళి
నాలాంటి మరెందరికో
విషాద రాగావళి
ఒక బాబు
లెక్కలేనన్ని టపాకాయలు
కాలుస్తుంటాడు,
మరొక బాబు
ఒక్కటపాకాయ లేక
ఏడుస్తుంటాడు.
ఒక పాప కేరింతలతో
కాకరపూవై కాలుతుంది
మరో పాప కన్నీళ్ళతో
దీనపుచూపై చూస్తుంది
కొందరేమో
కొన్న చిచ్చుబుడ్లు
"కాలలేదే" అని ఏడుస్తుంటే
ఇంకొందరేమో
ఉన్న'గుడిసెలూ
"కాలిపోయేనే" అని విలపిస్తుంటారు.
ఒకరేమో బానెడు పొట్టను
పిండివంటలతో నింపి
తినితినీ అలసిపోతే
మరొకరేమో జానెడు పొట్టను
పిడికెడు మెతుకులతో నింపలేక
తిరిగి తిరిగీ అలసి పోతారు.
అందరూ సమంగా
ఆనందం పంచుకున్నరోజే
నాలాంటి మరెందరికో
ఆనంద దీపావళి

# ఇద్దరు మిత్రులు

- ఏ. శశాంకమౌళి, (ఎం.ఫిల్)

సంగతి ఇదని
సదుపదేశం చేస్తే
ఆశయానికి
అడ్డు అనుకొని
దూరమయ్యాడు
ఒక మిత్రుడు
మానవత్వం ఇదని
మంచిగా చెప్తే,
సిద్ధాంతానికి సరిపోనని
దూరమైనాడు
మరో మిత్రుడు.

# నేనే ముఖ్యమం(

నా హుండీ డబ్బులు తీసుకెళ్ళి
నాన్న "గుట్కా" తింటే
నా క్రొత్త బట్టలు కుదవబెట్టి
అమ్మ "మట్కా" కడితే
నా స్కూలు పుస్తకాలు తూకానికేసి
అన్న "లాటరీ" కొంటే
చివరికి నాకు మిగిలేది........?
అందుకే
ఇల్లూ, ఒళ్ళూ గుల్ల చేసే
'గుట్కా' లాంటి వ్యసనాల్ని
మనసారా నిషేధిస్తా
నేనే ముఖ్యమంత్రినైతే

*ఫ్లాట్-118, బ్లాక్-సి, ఆర్.కె.యస్. అపార్ట్‌మెంట్, సి.డి.ఆర్. ఆసుపత్రి, హైదర్‌గూడ - 29.*

# బెంగాలీ కవిత

తెలుగుసేత: నిర్మలానంద

కష్టం కస్తూరి
- తస్లీమా నస్రీన్
కొన్ని కష్టాల్లో సాధ్యం కాదు
మందు పట్టీవేయడం గాయంమీద
రోగికి వేళకి మందువేసి ఆలనాపాలనా చేసే వారు లభిచరు
అందుకు ప్రయత్నమూ జరగదు
మమతల జాగరణా వుండదు రాత్రంతా
ప్రశ్నే ఉదయించదు
వాతావరణ మార్పుకి సంబంధించి,
ఆ కష్టాలు అలాగే గట్టెక్కుతాయి యీడ్చుకుంటూ

గుండెలు మండిచే కష్టాలు కొన్నయితే
'ఉఫ్'మని ఊది పారేసేవి మరికొన్ని
అయినా కష్టాల సూక్ష్మ శరీరంలో కూడా
ఎగిసే మంటలుంటాయ్

బల్లేలు విసిరి శరీరంలో గుచ్చవుగానీ
ఇలాంటి కష్టాలన్నీ
నీ కళ్ళురెండూ పొడిచేసి
మండించి మండించి మార్చివేస్తాయి
భగభగమనే నిప్పు కణికలుగా

కొన్ని కష్టాలున్నాయ్ చూశారూ!
రాత్రి గడిచేలోగా
కలిసిపోతాయ్ గాలిలో
జీవితంలో తిష్టవేసిన కష్టాలు
జీవితాంతం ప్రేమిస్తూనే వుంటాయి నిన్ను

*7-1-23, తమిళ్ స్ట్రీట్, చిన్న వాల్తేర్, విశాఖపట్నం - 530 017.*

# విజ్ఞాన సర్వస్వం - చారిత్రక అధ్యయనం

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న విజ్ఞానాన్ని సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయడం, తద్వారా వారిని విజ్ఞానవంతులుగా మలచడం అనేవి విజ్ఞాన సర్వస్వాల ప్రధాన ఆశయం, ప్రయోజనం. ఒక ప్రయోజనాత్మక సాహిత్య ప్రక్రియగా నేడు అన్ని దేశాల్లోనూ ఈ విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం జరుగుతూ ఉంది. అయితే ఈ విజ్ఞాన సర్వస్వాల ప్రాథమిక రూపాలు ఏవిధంగా ఉండేవో, చారిత్రక గమనంలో అవి పొందిన వికాస దశలు ఎలాంటివో మొదలైన అంశాలను పరిశీలించిన గాని, వాటి స్వరూప స్వభావాలను పూర్తిగా అంచనా వేసేందుకు గాని, వాటి ఆశయ ప్రయోజనాలను అవగాహన చేసుకొనేందుకుగాని వీలేర్పడదు. ఆంగ్లంలో ఉన్న "Encyclopedia" అనే పదానికి సమాంతరంగా తెలుగులో "విజ్ఞాన సర్వస్వం" అనే పదం వాడుకలో ఉంది. "Enkikloto Paidia" అనే గ్రీకు పదాలనుండి "Encyclopidia" అనే పదం ఏర్పడింది. అంటే విద్యావలయం లేదా జ్ఞాన చక్రం అని అర్థం!

పాశ్చాత్య దేశాల్లో విజ్ఞానసర్వస్వ మనదగిన గ్రంథం ప్రప్రథమంగా గ్రీకు దేశములో వెలువడి ఉంటుందని, ప్లాటో శిష్యులైన అరిస్టాటిల్, స్ప్యూసెవస్ అనే వాళ్ళలో ఒకరు దీన్ని నిర్మించి ఉంటారని పండితులూహించారు. రోము దేశానికి చెందిన 'మార్కస్ టెరెన్షియస్ వారో' క్రీ.పూ. 166-27 ప్రాంతంలో ఒక విజ్ఞాన సర్వస్వాన్ని కూర్చినట్లు తెలుస్తున్నది.

పాశ్చాత్య సాహిత్య క్షేత్రంలో 'ప్లనీ" అడుగిడడంతో విజ్ఞాన సర్వస్వాల రచన ఒక మలుపు తిరిగిందని చెప్పవచ్చు. 'ప్లనీ' కృషిఫలితంగా 'నాచురల్ హిస్టరీ' 37 సంపుటాల్లో వెలుగులోనికి వచ్చింది. ఫ్రాన్స్ దేశంలో క్రీ.శ. 1190-1264 మధ్యకాలంలో విన్సెట్ 'స్పెకులమ్ మానస్' అనే గ్రంథాన్ని సమకూర్చారు. ఇది మధ్యయుగాల్లో వెలిసిన విజ్ఞానానికి అద్దం పట్టిందని ప్రశంసింపబడింది.

క్రీ.శ. 17వ శతాబ్దంలో ఇంగ్లీషులో అక్షరక్రమంలో విజ్ఞాన సర్వస్వాలను నిర్మించడం ప్రారంభమైంది. 1667 ప్రాంతంలో 'జాన్ హారిస్' "An Universal Dictionary of arts & Sciences" అనే విజ్ఞాన సర్వస్వాన్ని ప్రకటించాడు. ఇది నేటి విజ్ఞాన సర్వస్వాల వలె సమిష్టికృషి ఫలితమై ఉంది.

ఈ విధంగా పాశ్చాత్య దేశాల్లో విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం క్రమ వికాసాన్ని పొందుతూ వచ్చింది. 1768లో "Encyclopaedia Britanica" 3 సంపుటాల గ్రంథంగా వెలువడింది. 1829లో అమెరికాలో "Encyclopaedia Americana" వెలువడింది. ఇవి ఎన్నో దశలను అధిగమించి విశ్వవిజ్ఞానాన్ని ప్రజలకు అందించేందుకు నేడు ఎన్నో సంపుటాలుగా వెలువడి ఉన్నాయి. ఇవే కాకుండా ఫ్రెంచి ఎన్‌సైక్లోపీడియా, వరల్డ్ బుక్ ఎన్‌సైక్లోపీడియా, కొలంబియా ఎన్‌సైక్లోపీడియా, యు.యస్.యస్.ఆర్. ఎన్‌సైక్లోపీడియా, స్లావినిక్ భాషల్లో వెలువడిన ఎన్‌సైక్లోపీడియాలు ఎన్నో ఉన్నాయి.

ఇదే విధంగా భారతీయభాషల్లోనూ నేడు విజ్ఞాన సర్వస్వాల రచన ముమ్మరంగా సాగుతున్నది. విజ్ఞాన జిజ్ఞాసువుల అవసారాలను తీర్చేందుకు రకరకాల విజ్ఞాన సర్వస్వాలు వస్తున్నాయి. నేడు మనం చూస్తున్న ఈ విజ్ఞాన

సర్వస్వాలన్నీ ఇంగ్లీషు భాషా సాహిత్యాల ప్రభావం వల్ల ఒక ప్రక్రియా రూపంలో అక్షర క్రమంలో వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాలు.

'విజ్ఞాన సర్వస్వం' అనే పేరు లేకపోయినా విజ్ఞాన ప్రసారం మన ప్రాచీన సాహిత్యం ద్వారా జరుగుతూనే వస్తున్నది. వేదాలలోనూ, పురాణ ఇతిహాసాలలోనూ, ఆ తరువాత వచ్చిన కావ్యాల్లోనూ విజ్ఞాన ప్రసారాన్ని ఆశించిన కవులు, రచయితలు, ఆనాటి విజ్ఞానాన్ని తమ రచనల్లో పొందుపరుస్తూనే వచ్చారు.

"విద్" అనే ధాతువు నుండి 'వేద' శబ్దం పుట్టింది. విద్=తెలుసుకోవడం కాబట్టి వేదము= తెలుసుకోదగినది. అంటే జ్ఞానమనే అర్థంలో చెప్పుకోవచ్చు. మన చతుర్విధ వేదాలు కేవలం మంత్రాలతో కూడినవే కాక ఆనాటి సాంఘిక జీవన విధానంతో పాటు అన్ని రంగాలకు చెందిన విజ్ఞానాంశాలను కూడా ప్రస్తావించిన గ్రంథాలుగా తెలుస్తున్నది. వేదాల్లో, అంకగణితము, బీజగణితము, విమాన, నౌకా నిర్మాణాలు, భవన నిర్మాణాలు 'వాస్తు శాస్త్రం) జోతిష్యం, సంగీతం, ఆయుర్వేదం, యుద్ధతంత్రం మొదలైన విజ్ఞానాంశాలెన్నో ప్రస్తావించబడ్డాయి.

ఆ తరువాత వచ్చిన పురాణేతిహాసాల్లో ఆనాటి విజ్ఞానమంతా క్రోడీకరింపబడి ఉండటం చేత వాటిని కూడా విజ్ఞాన సర్వస్వ లక్షణాలున్న గ్రంథాలుగా పండితులు అభిప్రాయ పడుతున్నారు. తెలుగులో వచ్చిన ఇటువంటి రచనల్లో ముఖ్యంగా చెప్పుకోదగినవి ఆంధ్ర మహాభారతం, పండితారాధ్య చరిత్ర, హంసవింశతి, వాణీవిలాస వనమాలిక మొదలైనవి.

నన్నయ (ధర్మతత్త్వజ్ఞులు...) అనే పద్యంలో చేసిన భారత ప్రశస్తిని బట్టి మహాభారతం విజ్ఞాన సర్వస్వ లక్షణాలు కలిగిన గ్రంథంగా తెలుస్తుంది. డా॥ మూలంపల్లి చంద్రశేఖరశర్మ, భారతాన్ని విశ్వవిజ్ఞాన కోశంగా నిరూపించారు. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయం ద్వారా పి.హెచ్‌డి. ఉపాధిని పొందిన గ్రంథం.

పండితారాధ్య చరిత్రలో ఆనాటి సమాజంలోని అన్ని రంగాలకు చెందిన విశేషాలతో పాటు ప్రజల జీవన విధానము వర్ణితమై ఉండడంవల్ల ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య దానిని తొలి తెలుగు విజ్ఞాన సర్వస్వంగా పేర్కొన్నారు.

18వ శతాబ్దంలో 'హంసవింశతి'ని విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథంగా డా॥ జి. వెంకటరత్నం నిరూపించడం జరిగింది. ఇది కాకతీయ విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్‌డి. ఉపాదిని పొందిన గ్రంథం. ఇందులో విజ్ఞానాంశాలతో కూడిన పదజాలాన్నంతటిని, బ్రౌను రెండు సంపుటాల్లో సమకూర్చి ఉన్నాడు.

వాణీవిలాస వనమాలిక కూడా విజ్ఞాన ప్రసారంలో ఇంచుమించు హంసవింశతి ప్రణాళికలోనే రచింపబడిన గ్రంథం. అందుకే బ్రౌన్ "The Present Work is a General Micellany Upon All Branches of Hindu Learning" అని ఈ గ్రంథాన్ని గూర్చి ప్రశంసించాడు.

20వ శతాబ్దం ప్రారంభంలో ఇంగ్లీష్ భాషాసాహిత్యాల ప్రభావం వల్ల భారతీయ భాషల్లో విశ్వవిజ్ఞానాన్ని ఒక క్రమ పద్ధతిలో సమీకరించి, విజ్ఞాన సర్వస్వాలనే పేర వెలయించడం, అది ఒక సాహిత్య ప్రక్రియగా కొనసాగడం కనిపిస్తుంది.

మొట్టమొదట బెంగాలీలో బెంగాలీ విశ్వకోశ్ (1819-21) సంపుటాల్లో వచ్చింది. 1916లో ఇది 24 సంపుటాల్లో హిందీలోకి అనువదించటమైంది. అదే విధంగా మరాఠీ, గజరాతీ మొదలైన ఉత్తర భారతదేశ భాషల్లో విజ్ఞాన సర్వస్వ నిర్మాణం కొనసాగింది.

దక్షిణ భారతదేశ భాషల్లో ముఖ్యంగా తెలుగులో 1915ల ప్రాంతంలో కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ' మనే పేర సంపుటాలు వెలువరించారు. ఇది 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' స్థాయిలో వచ్చిన విజ్ఞాన సర్వస్వంగా పండితులు భావించారు.

కొమఱ్ఱాజు వారి మరణంతో ఈ విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం ఆగిపోయింది. ఇది ఎంతైనా శోచనీయం.

1947 ప్రాంతంలో "తమిళ వళర్చిగజకమ్" (తమిళ అకాడమీ) అనే పేరుతో ఏర్పడిన సంఘం "కళమ్ కాళింజయమ్" అనే పేర విజ్ఞాన సర్వస్వాల నిర్మాణాన్ని చేపట్టింది. కన్నడంలోనూ 'నిరంజన' ముఖ్య సంపాదకులుగా ఏడు సంపుటాల్లో "బాలల విజ్ఞాన సర్వస్వాన్ని'' నిర్మించడం జరిగింది. మైసూరు విశ్వవిద్యాలయం "విశ్వకోశ' నిర్మాణాన్ని చేపట్టింది. మళయాళంలోనూ ఎన్.గోపాలపిళ్ళె ముఖ్య సంపాదకులుగా విజ్ఞాన సర్వస్వం నిర్మాణం సాగింది. వెట్టంమణి 'పురాణిక్ ఎన్‌సైక్లోపీడియా' ను నిర్మించాడు. మలయాళంలో వచ్చిన ఈ విజ్ఞాన సర్వస్వ తరువాత ఇంగ్లీషులోనికి అనువదించబడింది. తెలుగులో 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' తరువాత కొంతకాలం ఈ విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం సాగలేదు. 1947లో మద్రాసులో తెలుగు భాషా సమితి ఏర్పడి విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి పూనుకుంది. అది 1984లో తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం అయ్యేటప్పటి వరకు 14 సంపుటాలను వెలువరించింది.

అదేవిధంగా హైద్రాబాదులో ప్రొఫెసర్ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి నేతృత్వంలో 8 సంపుటాల్లో 'సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు' వెలువరించబడ్డాయి. విజ్ఞాన దీపిక, ఆంధ్ర విజ్ఞానం, ప్రపంచరాజ్య సర్వస్వం మొదలైన ఎన్నో విజ్ఞాన సర్వస్వాలు తెలుగులో వెలువడి ఉన్నాయి.

అయినా పాశ్చాత్యభాషల్లో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలతో పోల్చుకుంటే వాసిలోకాని, రాసిలోకాని తక్కువనే విషయం తెలుస్తుంది. అంతేకాకుండా "Children's Britanica" స్థాయిలో కాకపోయినా ఒక సమగ్ర ప్రణాళికాబద్ధమైన బాలల విజ్ఞాన సర్వస్వం ఇంతవరకు తెలుగులో వెలువడకపోవడం ఎంతైనా శోచనీయం.

### అధో జ్ఞాపికలు

1. ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా 'Encyclopaedia'
2. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా
3. హంసవింశతి విజ్ఞాన సర్వస్వం Vol-I పుట 68
4. వర్ల్డ్ బుక్ ఎన్‌సైక్లోపీడియా Vol-'E'
5. విజ్ఞాన సర్వస్వం Vol-IX పుట 1
6. Madras Manscript library - Vol-I & II.
7. హంసవింశతి విజ్ఞాన సర్వస్వం Vol-I పుట 59
8. విజ్ఞాన సర్వస్వము Vol-II పుట4.

**మల్లికాదేవి**
C/o ఎన్. రామారావు
ఇ.నెం.13-3-39, వరంగల్.



# ీకము - సామాజిక స్పృహ

తెలుగు శతకములు తెలుగువారి జాతీయతను, సాంఘిక జీవితమును గ్రహించుటకు నీతి, సత్ప్రవర్తన అలవడుటకు మిక్కిలి తోడ్పడును. ఆంధ్రవాఙ్మయము నందలి శతకములను నీతి శతకములు, భక్తిశతకములు, వ్యాజస్తుతి శతకములు, వేదాంత శతకములని విభజించవచ్చును. ప్రస్తుత "నరసింహ శతకము" భక్తి శతకకోవకు చెందినది. శతకములు సహజముగా సమాజములోని కుళ్ళును ఆచార వ్యవహారములను, వ్యక్తుల వ్యక్తిత్వమును సమాజము నందలి ప్రతి విషయమును కూడా వివరించును. సామాజిక స్పృహ ప్రతిబింబింపగల శతక రాజములలో "నరసింహాశతకము" ప్రసిద్ధినొందినది. "భూషణ వికాస శ్రీధర్మపురి నివాస దుష్టసంహార నరసింహ దురితదూర" అను మకుట బద్ధమైన నరసింహాశతకము శేషప్పయను కవీశ్వరునిచే విరచితమైనది.

శేషప్ప చాత్తాద వైష్ణవుడు. భార్యాపిల్లలు గలవాడు. యాయవారము చేసి జీవించేవాడు. అది యతడే చెప్పుకొని యున్నాడు. ఉదరపోషణకై పెక్కు దారిద్ర్యబాధల ననుభవించినాడు. తెలంగాణా ప్రాంతమునందలి కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలుకాలో వేదశాస్త్రములకు పుట్టినిల్లై ప్రాచీన సంస్కృతి కాలవాలమై గోదావరి తీరమున దక్షిణకాశి అనబడు "ధర్మపురి"యను అతి ప్రాచీన పుణ్యక్షేత్రముకలదు. ఇదియే శేషప్ప జన్మస్థలము ఈ ధర్మపురియందవతరించిన నరసింహస్వామి వారినే శేషప్ప సేవిచి కృతార్థుడైనాడు.

శేషప్ప ధర్మపురి నరసింహస్వామి వారి కంకితముగా "నరసింహాశతకం" "చక్రధర ధర్మపురిధామ సార్వభౌమ, నరహరీ భక్తజన కల్ప నాగతల్ప" యను మకుటముగల నరహరి శతకమును మరియు నృకేసరి శతకమును రచించెను.

శేషప్ప గొప్ప భక్తుడు. ప్రతి విషయమును సమాజమునకు ఉపమానములతో హృదయమునకు హత్తుకొనునట్లు చెప్పినాడు. "కోతికి జలతారు కుళ్ళాయి ఏటికి" (న.శ.13) "భువన రక్షణ నిన్ను బొగడ నేరనినోరు' ' (న.శ.30) ఇత్యాది పద్యములు దేవుని యెదుట నిలిచి అతనిని పలుకరించుచున్నాడా!యనిపించుటనట్లు అనేకములను గూర్చినాడు.

శేషప్ప లోక వ్యవహారములను చక్కగా నెరిగనవాడు. అతనికి గల ప్రచారానుభవము ఈ క్రింది పద్యములు చాటి చెప్పుచున్నవి. '8అతి లోభులను భిక్షమడుగబోవుట రోత"! "ఆదాయములు లేక యప్పదీయుట రోత"! 'జారచోరుల గూడి జనుట రోత!' .. (న.వ.62)

పరమలోభ స్వభావము గలవారు పుణ్య కార్యములు, దానధర్మములు కూడా చేయటానికి ఘర్షణ పడుతుంటారు. కనీసం "ఎంగిలిచేత కాకిని కూడా కొట్టరు" అటువంటి కక్కుర్తి స్వభావము కలిగిన వారి దగ్గరకు వెళ్ళి భిక్షనడగకూడదని శేషప్ప అభిప్రాయము. "గొడ్డుటావు బితుకగుండ గొంపోయిన పండ్లు రాలదన్ను పాలనీదు". లోభివాని నడుగ లాభంబు లేదయా విశ్వదాభిరామ వినురవేమ" అని లోకవ్యవహారములను చక్కగానెత్తి చూపిన వేమన మాటలు ఈ సందర్భమున జ్ఞప్తికి వచ్చును.

ఇంకనూ శేషప్ప మానవ జీవితములను గురించి తెలుపుతూ మనకు వచ్చే ఆదాయమునకనుసరించి జీవితము గడుపవలెనని తెలిపినాడు. సహజముగా లోకములో చాలావరకు వ్యక్తులు ఎదుటివారి విలాస జీవితాలను చూసి తాము కూడా వారి మాదిరిగానే నుండవలెనన్న కోరికలచేత తమ రాబడికి మించిన అప్పులు చేసి విలాస జీవితాలకై ప్రయత్నిస్తారు. ఆ విధముగా చేయడం వల్ల జీవితములో ఎన్నో సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. కావున ఎదుటివారు యెంత విలాసంగా

నున్నప్పటికీ మన పరిస్థితి హద్దు లెంతవరకో అంతవరకే నుండవలెను. అట్లు కాకున్నచో "పులిని చూసి నక్క వాతపెట్టుకొన్నట్లు" ఇబ్బందులు పడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అందుకే ఆదాయమును మించిన అప్పులు తీసినచో చివరకు చిప్పలు చేతికి వచ్చును. అను లోకోక్తిని దృష్టి యందుంచుకొన్నచో జీవితము సవ్యముగా గడచును. అంతేగాక శేషప్ప వ్యభిచారులతో, చోరులతో సహవాసము చేయుట యోగ్యము కాదనినాడు. ఎందుకంటే సమాజములో అల్పులతో సాంగత్యము చేసిన వ్యక్తి యొక్క బుద్ధి నీచమవుతుంది. ప్రపంచంలో కూడా వ్యభిచారులకు, చోరులకు గుర్తింపు చాలా అరుదు. అట్టివారనిన ప్రతివారు ఏహ్యాభావమునే ప్రకటిస్తారు. కాని ఎవరు కూడా అప్యాయతతో ఆదరించరు. కావున అట్టివారి మైత్రివలన వ్యక్తి ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని కొల్పోతాడు. కాని అట్టి వ్యక్తియే సజ్జనులతో, స్నేహం చేసినట్లయితే సమభావం కలుగుతుంది. చక్కని ఆలోచనావిధానం అలవడుతుంది. పండితులతోడి మైత్రివలన పాండిత్యము లభిస్తుంది. గొప్పవారితో మైత్రివలన గొప్పతనము కలుగుతుంది. మరియు "జాడ్యం ధియోహరతి సిజ్ఞతి వాచి సత్యం। మహోన్నతిం దిశతి పాప మపాంకరోతి। చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం। సత్సంగతిః కథయః కిం నకరోతి పుంసామ్" (భర్తృహరి సుభాషితములు) సత్సహవాసము బుద్ధిమాంద్యమును పోగొట్టును. సత్యవాక్యములనే పలుక జెయును. దిక్కుల యందు కీర్తి వ్యాపింపజేయును. వేయేల అది చేయజాలని మంచి ఏ లోకమున లేదని చెప్పబడినది. కావున దుర్జనుల స్నేహము విడనాడి ఎల్లప్పుడు సజ్జనసాంగత్యమే పరమావధిగా ఎంచవలెను. లోకహితమును కాంక్షించవలెను. ఈ విధంగా శేషప్ప లోకవ్యవహారములను చక్కగా గుర్తెరిగి ఒక్కొక్క సీసమును పాఠకుల కర్ణాలకు భూషణముగా తొడిగినాడు.

నీతిబోధ, సుమతి, వేమన మొదలగు శతకములలో ప్రధాన విషయమై యున్నది. నరసింహ శతకము నందు నీతి బోధక పద్యములు అనేకములు కలవు. "తనయుండు దుష్టైన తండ్రి తప్పు" కూతురు చెడుగైన మాతతప్పు" (న.శ.12) శేషప్ప దుష్టతనముల గురించి ఈ విధముగా వివరించినాడు. కుటుంబములో దుష్టతనయుడున్నచో అట్టిదోషము తండ్రిదేయని చెప్పినాడు.

ఎందువలననగా కుటుంబములో అందరిని శాసించే అధికారము తండ్రికుంటుంది. అట్టి తండ్రి తాగుబోతు, జూదరి, వ్యభిచారియై యుండి తనయుణ్ణి శాసించినట్లయితే అతని శాసనములకు విలువనివ్వక పోవడమే గాక ఎదురు తిరిగే ప్రమాదమున్నది. కావున తనయుణ్ణి శాసించేముందు తండ్రి సచ్ఛీలుడై యుండి తనయుణ్ణి సన్మార్గములో నుంచుటకు ప్రయత్నించాలి. తండ్రి సచ్ఛీలుడైన్పటికీ తనయుడు దుష్టుడైనచో అతన్ని శాసించే తండ్రి దోషమే. అటువంటి దుష్టతనయుని వల్ల కుటుంబమునకు ఏ విధంగా అపకీర్తి కలుగునో ఈ క్రింది శ్లోకములో చెప్పబడింది. "శుష్కేణైకేన వృక్షేణ వనం పుష్పిత పాదపం కులం చారిత్రహీనేన పురుషేనేవ దహ్యతే॥ (భర్తృహరి సుభాషితములు). ఏ విధముగా నైతే పచ్చని వనములో ఒక ఎండిన వృక్షమున్న దానికి నిప్పంటి నప్పుడు ఆ వనమంతయు కాలిపోవునో అదేవిధంగా సద్వంశములో దుష్టతనయుడున్నప్పుడు ఆ వంశమునకే గాక నతనిని శాసించే తండ్రకి కూడా అపకీర్తి కలుగును. కావున "తనయుండు దుష్టుడైన తండ్రి తప్పు" అని తెలుపుతూ పితృస్వామ్యవ్యవస్థలో తనయుల పట్ల తండ్రులకు గల బాధ్యతను చక్కగా గుర్తింపజేసినాడు. మరియు మాతృస్వామ్య వ్యవస్థలో కూతురు తల్లి అధీనంలో ఉంటుంది. అటువంటి కూతురు దుర్గుణవంతురాలైన ఆ బాధ్యత తల్లిదేననియు, తల్లి పాలనలోని లోపమే అందులకు హేతువని చెప్పినాడు. ఇటువంటి తప్పులు గుర్తించక ఎవరిని ఎంతవరకు శాసించాలన్న విషయము దృష్టి యందుంచుకొనక సమాజములోని జనులు తమకిష్టము వచ్చినట్లు మెలుగుతున్నారన్న కవి భావము ఈ పద్యమునందు సుస్పష్టమగుచున్నది.

కాషాయ వస్త్రములు ధరించి సన్యాసులమంటూ ప్రజలను మోసంగించెడు వారిని గురించి శేషప్ప ఇట్లనినాడు. కాషాయ వస్త్రాలు గట్టి కప్పిననేమి యాశ

పోవక కాడు యతివరుండు। ఇట్టి లౌకికవేషాలు గట్టుకొనిన। గురుని జెందక సన్ముక్తి దొరకబోదు (న.శ.38) నేటి సమాజములోని కొందరు కేవలము కాషాయ వస్త్రములు కట్టుకున్నను సర్వసంగపరిత్యాగులమని చెప్పుకున్నను దైవమునందు మనసు లగ్నము చేయక అన్నిటి యందు యాశవిడనాడనినాడు యతివరుడు కాలేరని చెప్పినాడు. మాయవేషాలు ధరించి ప్రజలను మోసగించెడు కపటయతుల గురించి వేమన చెప్పిన అభిప్రాయము ఈ సందర్భమున స్ఫురణకు వచ్చును. "కరకు కాయని తిని కాషాయ వస్త్రముల్ బొడి నెగల్గి బొరయుచుండ్రు। తలలు బొడులైన తలపులు బోడులా। విశ్వదాభిరామ వినురవేమ। అని కపట గురువులను నిలదీసి యడిగినాడు. లౌకికపరమైన రంగుల దుస్తులతో వేషాలు ధరించి మాలలు వేసి దీక్ష నొందినప్పటికీ ఇతరములందు కోరికలు విడువని వానికి గురుని జెందనివానికి ముక్తి దొరకదను చెప్పు మాటలలో కేవలము రంగుల దుస్తులలో [illegible]త్వం ఉండదని, సర్వసంగ పరిత్యాగమనేది మనిషి మనసులో నుండి పుట్టవలెనని, లౌకికవేషాలకు భగవంతుని సాక్షాత్కారము కలగదని భక్తుడు తన హృదయ సింహాసనంలో భగవంతుని నిలుపుకున్నప్పుడే ఆయన దర్శనం [illegible] విషయము ప్రస్ఫుటమగుచున్నది.

[illegible] సమకాలీన వ్యవస్థను చక్కగా నాకళింపు [illegible] సంఘమునందలి కుళ్ళునేరి తీక్షణముగా విమర్శించుటలో వేమన అందె వేసిన చేయి. శేషప్ప కొన్ని సందర్భములలో వేమననుసరించి సమాజంలోని కుళ్ళును దర్పణము పట్టినట్లుగా చూపినాడు. "అధిక విద్యావంతు లప్రయోజకులైరి। పూర్ణశుంఠలు సభాపూజ్యులైరి." (న.శ.26) నిరంతర అధ్యయనము వలన భాషాభివృద్ధి కలుగుతుందన్న విషయము సేకరించి భాషమీద అధికారము నార్జించుకొని పాండిత్యమునొందిన పండితులు అప్రయోజకులైనారని తెలిపినాడు. అనగా ప్రతిభావ్యుత్పత్తులు కలిగి సహజ పాండిత్యము గల మేధావులు మారుమూల గ్రామాలలో మరుగున పడియున్నారు వారికి తగిన అవకాశములు లభించక ఉన్నత స్థానములో గుర్తింపు లేదని, విషయ పరిజ్ఞానము లేక భాషమీద అధికారము లేని పూర్ణ శుంఠలు సభలలో సమాజంలో విద్యావంతులుగా పూజింపబడు తున్నారనియు కవి తన ఆవేదనను వ్యక్తము చేసినాడు. ఇక్కడ శేషప్ప "పూర్ణశుంఠలు" అను పదము ప్రయోగించడం వలన ఆయనకు వారిపట్ల గల ఏహ్యాభావము స్పష్టమగుచున్నది. శేషప్ప సమకాలీన సమాజము గురించి చెప్పినప్పటికీ నేటి సమాజ దుస్థితి కూడా అదేవిధముగా నున్నదనుటలో అతిశయోక్తి లేదు. ఎందుకంటే నేటి సమాజములోని వారు కూడా వివిధరంగాలలో కృషిచేసి పరిశోధనలు జరిపి విద్యావంతులైన ప్పటికీ ఉన్నతస్థానములో నుండదగ్గ శక్తి సామర్థ్యములు న్నప్పటికీ తగిన అవకాశములెక నిర్లక్ష్యము చేయబడి మారుమూల గ్రామాలలో మరుగున పడుతున్నారు ఒక రకంగా వీరు విద్యావంతులై కూడా అప్రయోజకు లైనపుడు ఇకముందు విద్య నభ్యసించడానికి కూడా ఆలోచించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఒకవేళ ఆ పరిస్థితి ఏర్పడినపుడు అంతా అప్రయోజకమే అవుతుంది. శేషప్ప చెప్పిన ప్రతి మాట సర్వకాల సర్వావస్థల యందు వర్తిస్తుందనుట నిత్యసత్యము.

ఇదే విధముగా అల్పాక్షరాలలో అనల్పార్థ రచన చేసి "నరసింహశతకము" నందు ప్రతి విషయమును ద్రాక్షపాకశైలిలో రచించుటవలన ఒక్కొక్క పద్యము చదువునపుడు ఒక్కొక్క ద్రాక్షపండునోట పడినట్లుగా అనుభూతి కల్గించుచూ పండిత పామరుల కాస్వాద యోగ్యమగుచూ చక్కని సామాజిక స్పృహను ప్రతిబింబింప చేసిన శేషప్ప నరసింహశతకమునకు శతక సాహిత్యంలో అగ్రస్థానము లభించుట సమంజసమనిపించుచున్నది.

గుండి రామ్‌కుమార్
తెలుగు లెక్చరర్ (పార్ట్‌టైమ్)
ఇ.నెం. 11-39/ఎ, గోదావరి రోడ్,
ధర్మపురి పోస్టు కరీంనగర్‌జిల్లా

# సాహిత్య కృషీవలుడు దువ్వూరి

మహాకవి, విమర్శకశిరోమణి, చిత్రలేఖకుడు, కర్షకుడు, గ్రామ జీవన పిపాసి, గాంధేయవాది, 'కవికోకిల' గా ప్రసిద్ధుడు దువ్వూరి రామిరెడ్డిగారు.

శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు నెల్లూరు జిల్లా గూడూరులో క్రీ.శ. 1895లో జన్మించారు. లక్ష్మీదేవమ్మ, సుబ్బారెడ్డి వీరి తల్లి, దండ్రులు. శ్రీ రామిరెడ్డిగారు గూడూరు పెమ్మారెడ్డి పాలెంలో ప్రాథమిక విద్యను అభ్యసించారు. తండ్రి గతించటం వలన చిన్న వయసులోనే చదువుకు స్వస్తిచెప్పారు. 'థర్డ్‌ఫారం గ్రాడ్యుయేట్'గా మిగిలిపోయారు. కాని స్వయం కృషితో రామిరెడ్డి పెక్కు విద్యలు నేర్చు కున్నారు." పాఠశాలలో నేను నేర్చిన విద్య చాలాతక్కువ, నన్ను గృహవిద్యాలయ శిక్షితుడనుట యొప్పగును. నా వృత్తి వ్యవసాయము. ఇట్టి విషయాలు, విజ్ఞాన శాస్త్రములును, మెకానికల్ ఇంజనీరింగ్‌ను, కవిత్వ రచనను ప్రకటించుటకు ముందు కొన్నినాళ్ళు నేను చిత్రలేఖన మును, మృత్తికా విగ్రహ నిర్మాణమును చేయుచుంటిని' అని రామిరెడ్డిగారు దెలిపినారు. జ్యోతిష్య వశీకరణం ఆయన అభిమాన విద్య. రేడియో, కెమెరా వంటి ఆధునిక యంత్రాలను ఆయన స్వయంగా తయారు చేశారు. చలన చిత్రాలకు రచన, దర్శకత్వము నెరపారు.

బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీ రామిరెడ్డికి ఆయన 19వ ఏటనే కవిత్వము రాయాలనే కోరిక పుట్టింది. తొలిదశలో పద్య విద్యను సాధనచేస్తూ, ఆయన రసిక జనానందము, స్వప్నాశ్లేషము, అహల్యానురాగము, కృష్ణరాయబారము, ఋతు సంహారము, పుష్పబాణ విలాసము అనే కావ్యాలు రచించినారు.

శ్రీ రామిరెడ్డిగారు రచించిన వనకుమారి కావ్యము విజయనగర మహారాజాస్థానంలో జరిగిన కావ్యస్పర్ధలో బహుమతి పొందినది.

దువ్వూరి వారి కవితా శిల్పము ప్రథమ కావ్యమైన నలజారమ్మలో కంటే వనకుమారిలో నూతనమైన మెరుగులు సంతరించుకొన్నది కనుక, వనకుమారి కథా శిల్పమును, కవితా శిల్పమును, మించినదనుట వాస్తవము. ఇందులో అచ్చుటచ్చుట రెడ్డిగారి సంస్కృత పాండిత్యము వెల్లడియగుచున్నది. దీనిలో ప్రధాన రసము శృంగారము. అది ఉచిత రీతిలో పోషింపబడినది. ఇంకా ఈ కావ్యంలోని అద్భుతమైన సన్నివేశాలు, అపూర్వమైన వర్ణనలు, అనన్యశైలీ విన్యాసము, చదువరులను రసోన్మత్తులను కావిస్తున్నది. నిరంతర, సార, ప్రవాహ బాంధవ పదజాల బద్ధ కవితానవ భావ మనోహరత్వము ఈ కావ్యం లో నిక్షిప్తమైందని పలువురి పండితుల అభిప్రాయము.

గొఱ్ఱెలమంద, బెబ్బులి గాండ్రింపు విని చెల్లా చెదురై ఎచ్చటికో పోయింది. తత్ప్రాంతమంతా శిలామయ మగుటచే ఖురాంకములు ఏర్పడలేదు. వనకుమారి కారు చీకట్లలో దారి తెలియక దిగులుపడి కన్నీరు కార్చుచూ, ఒక బండపై కూర్చొని చింతించినది. అప్పుడు రామిరెడ్డిగారు వనకుమారి మనస్తత్వాన్ని ఈ క్రింది విధంగా చక్కగా నిరుపించారు.

కొండ నెత్తమ్ముల గోరాడు మబ్బుల
గమన సౌందర్యంబు కాంచి, కాంచి
మేఘోదయంబున మిస, మిస, పురివిప్పి
యాడునెమ్మల యొప్పులరసి యరసి
యమృత ధారలరీతి నచ్చమై ప్రవహించు
సెలయేళ్ళలో క్రీడ సలిపి, సలిపి
ప్రకృతి మంజులమైన పక్షులగానంబు
తమితీర వీనుల త్రావి, త్రావి
ఎండవేళల పూపొదరిండ్ల దూరి
హరిణ గర్భిణులకు చివురాకులొసగి

ప్రసవమాల ధరియించి ప్రతిదినంబు
కాననంబున రాణియై క్రోలుచుంటి.

వనకుమారి ఏ విధంగా అడవిలో పెరిగిందో ఆమె చిత్తవృత్తు లెంత నిసర్గ రమణీయాలో పై పద్యంలో రామిరెడ్డిగారు వర్ణించినారు.

ప్రొద్దు వొడిచిన దాదిగా ప్రొద్దుగ్రుంకు వరకు
కష్టింతువేగాని ఇరుగు పొరుగు వారి
సొమ్ముకై యాసుగోర బోవు ఎంత
నిర్మల మోయి నీ హృదయ కళిక

"పానశాల" రామిరెడ్డిగారి కీర్తి చిరస్థాయిగా నిల్పగల అనువాదకావ్యము. అపూర్వమైన తాత్విక చింతనతో, అపురూపమైన కవిత్వముతో జగద్విఖ్యాతి గడించిన గొప్ప విజ్ఞాని ఉమర్‌ఖయ్యాం. వీరి రుబాయిల ఆంధ్రీకరణ రామిరెడ్డి పానశాల. రామిరెడ్డిగారు మూలాన్ని యధాతథంగా అనువదించలేదు. "నా ఆంధ్రీకరణము మూలమునకు టీకవలె నుండదు" పారశీక జాతీయములలో ప్రకటింపబడిన భావము తెలుగులో అట్లే స్ఫురించుటకు ఆవశ్యక ములైన మార్పులను. రసపోషణమునకు వలయు కూర్పులను కావించితిని. అని పానశాల ఉపోద్ఘాతంలో తెలిపినారు.

"జల జల మంజుటార్భటుల జార్వొను నీ సెలయేటి కానలన్ మొలచిన లేత పిచ్చికల మోటుగ గాలిడ బోకు" "గతము గతంబే ఎన్నటికి కన్నులగట్టదు" "జీవిత సార్థవాహము విచిత్ర గతిం బయనించు" అంతములేని ఈ భువనమంత పురాతన పానశాల. మరణభయంబు నాకు నణుమాత్రము లేదు. మదీయ జీవసంభరణ బయంబె" మొదలైన పద్యాలతో రామిరెడ్డి అనువాద రచన ప్రశస్తమైనది

శ్రీ రామిరెడ్డిగారు ఇంగ్లీషు భాషలో కూడా కవిత్వము రచించారు. వీరు ఇంగ్లీషు కవిత్వాన్ని జేమ్సుజీ, కజిన్స్ అనే ఆంగ్ల పండితులు, కళా విమర్శకులు మెచ్చుకున్నారు.

ఇంకా రామిరెడ్డిగారనేక సారస్వత వ్యాసములు రచించినారు. వీరి గ్రంథాలన్ని కవికోకిల గ్రంథావళి శీర్షికక్రింద అచ్చయ్యాయి.

కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు భాషా భావ స్వాతంత్ర్యములు ఎక్కువగా ప్రకటింప బడకుండా, సంప్రదాయములు పాటించుచూ కవిత సాగించుట కొనసాగించును. ప్రాచీన కవితా రీతులపై దండెత్తి ఉవ్వెత్తుగా, నక్షత్ర వీధు లలో నెగురువంటి వాడు కాడితడు. అయా భావ వైభవా వేశమునకు సరిపడు భాషా భావ ప్రవేశము కలవాడు. సంస్కృత వాఙ్మయం పొలుపులను తెలిసికొన్నవాడు, సహజముగా సౌజన్యమూర్తి.

"వేగు జామున వికసించు విరుల యందు
రేకు వెడలించు సంజ పూ రెమ్మలందు
కావ్యమున బోలె బఠియ్యింతు కౌతుకమున
ప్రకృతి సామ్రాజ్య పాలన పద్మములను
చటుల కల్లోల రసనల సాగరంబు
పదలు, రేయి నాలపించు పాటలందు
అసితర గ్రాహ్యధర్మంబులై చెలంగు
విశ్వసృష్టి ప్రాకారముల్ వినుచునుండు
గదురు తుంపర ముత్యాల కాన్కలిడుచు
తరలు సెలయేటి పాటలో దాగియున్న
రాగతత్వంబు నామని ధాత్రులందు
కూయు కోయిల కడ నేర్చి కొందు వనుల" ఇట్టి

తత్వముతో ఈ రెడ్డి కవికోలము మధుర కావ్య గానము చేసినది. ఇటువంటి దువ్వూరి రామిరెడ్డిగారి సాహిత్య ధనము పవిత్రమైనది, స్థిరమైనది. కవితా కళయందే గాక, లోక వ్యవహారమునందు చాతుర్యం కలిగిన రామిరెడ్డిగారు అభినందనీయులు.

**బండ అశోక్ రెడ్డి**
రూమ్ నెం. 32, 'సి' హాస్టల్,
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్-7.

# లోక సిద్ధి పొందిన సజీవ శిల్పం మొల్లకవిత్వం

పరిణామ క్రమంలో వ్యవస్థీకృతమైన నాగరిక సమాజానికి మూలమైంది సజీవ సమాజం. అక్కడి బ్రతుకు సిద్ధము. ఎక్కడికక్కడ ఎన్ని విభేదాలు వున్నా సిద్ధాంత రాద్ధాంత ఖండనలేని అవ్యక్తస్థితి. అక్కడ మాటలు, చేతలు కలసిపోయిన దార్శనిక స్థితి. అక్కడి సజీవ సామాజిక కుటుంబ చిత్రణమే రామాయణం. అంచేతనే రామాయణం ఒక కల్పవృక్షం. నాటినుండి నేటివరకు సమాజ పరిరక్షణకు కుటుంబ విలువల్ని పరివేష్టించిన కావ్యమైంది. వాల్మీకి నుండి విశ్వనాథ వరకు నిత్య చైతన్యవంతమైన ఫలాలను అందిస్తూనే వుంది. అంచేతనే మహోహాలికులైన కవులు తమదైన అవ్యక్త చైతన్యంతో దర్శించారు. తరించారు.

ఆ పరంపరలో సజీవ సామాజిక దర్శన యోగంతో రామాయణ తత్త్వాన్ని దర్శించిన యోగిణి ఆతుకూరిమొల్ల. ఆదిమ జీవితం నగర జీవితంగా రంగులు పులుముకున్నాక కూడ మనిషిలో హృదయాన్ని పదిలపరచిన గ్రంథం మొల్ల రామాయణం. మొల్ల రామాయణం భావస్ఫూర్తిని పొందిన పాత్రల చిత్రణం. ఆమె కవిత్వం సజీవశిల్పం. అలౌకికత్వం లౌకికత్వంతో సమన్వయం సాధించుటచే ఆమె కవిత్వం ఒక సజీవశిల్పం అయింది. కట్టమంచివారన్నట్లు "సమకాలీన సమాజ చైతన్యం స్వానుభవమై సాక్షాత్కరించినపుడు సజీవమైన శిల్పంగా ప్రాణం పోసుకుంటుంది" అంటే అసామాన్య వ్యక్తిత్వం సామాన్య వ్యక్తిత్వంతో సమన్వయాన్ని పొందటం. అంచేతనే మొల్ల రామాయణంలోని పాత్రలు సంఘటనలు, మానవీయతను సాధించిన దైవీయ సంఘటనలుగా దర్శనమిస్తాయి.

మొల్ల ఎలాంటిదో ఊహించుకోవచ్చు. మొల్ల తండ్రి గొప్ప శివ భక్తుడు. చిన్నతనంలోనే ఆమెను పరమశివుని పాదార్చనకు అందించిన వీరశైవుడు. స్త్రీ విద్య, శూద్ర విద్యకు ప్రోత్సాహం లేని నాటికాల సమాజమే పాఠశాలైంది. సగటు మనిషే గురువయ్యాడు. సామాజిక నిత్యసత్యాలే ఆమె మాటలైనాయి. లోకానుభవమే ఆమె గురువైంది. అంచేతనే ఆమె శివకేశవ భేదం లేని విశ్వజనీనమైన మహోన్నత మానవీయతను రామాయణ కావ్యం ద్వారా లోకానికి అందించింది. దివ్య చైతన్య స్వరూపాలైన రామాదులలో సామాజిక నిత్యచైతన్యాన్ని పరిపోషించి లోకసిద్ధి పొందిన సజీవ మానవ మూర్తులుగా శిల్పించింది.

"చెప్పమనె రామచంద్రుడు
సెప్పించిన పలుకుమీద జెప్పెద నేనె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుడు కవుల్"

రామచంద్రుడు తనచేత పలికించినట్లుగా పలుకుచున్నాను. అందునా ఇహపరాన్ని సమన్వయించటానికి, అని తాను దర్శించిన లోకనేపథ్యాన్ని విశ్లేషిస్తూనే, సిద్ధాంతరాద్ధాంతం చేసేవాళ్లను ఒక మొట్టికాయ వేస్తూ "ఇతిశుశ్రుమం ధీరాణాం, ఏతత్తద్ వ్యాచచక్షిరే" అని పోతన వెంట నడచిన యోగిణి మొల్ల.

"కావ్య సంపదక్రియలు నిఘంటువులు
గ్రమము లేవియు నెఱుగ విఖ్యాతగోప
వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత
నెఱిగి కవిత్వము జెప్పగా నేర్చుకొంటి"

పండితుల పటాటోపములు తెలియని, శాస్త్ర శుశ్రూషలు చేయలేని, లోకసంచారంచేత తారసిల్లిన మల్లేశుని వల్ల చెప్పటాన్ని నేర్చుకున్నానని నిష్కర్షగా చెప్పింది.

కథాపరంగా వాల్మీకి రామాయణాన్ని అనుకరిస్తూనే సమయాను కూలంగా భావస్వేచ్ఛను సాధించింది.

**రామునిలో మానవీయత** : దశరథుడు పుత్రకామేష్ఠి యాగం తర్వాత పుత్రులను పొందిన తర్వాత, అందివచ్చిన కుమారులకు విద్యాబుద్ధులను నేర్పటానికి విశ్వామిత్రుడు వారిని ఆశ్రమానికి తీసుకుని వెళ్ళినాడు. ఆశ్రమ ప్రాంతంలో మునుల యాగాన్ని విఫలం చేయుటకు హా! హా! కారాలు చేసుకుంటూ వచ్చిన 'తాటకి'ని సంహరింపమని విశ్వామిత్రుడు శ్రీరామునికి చెప్పగా శ్రీరాముడు తటపటాయించు సందర్భమును చక్కగా వర్ణించింది.

"ఈ యాడుదాని జంపగ
నాయమ్మ్మన కేమి గొప్ప నగరేవీరుల్
ఛీ యని రోయుచు నమ్మని
నాయకు భయమెరిగి తనమనమ్మున నలుకన్"

రాముడు దేవదేవుడే అని చెబుతూనే లోకకళ్యాణార్థమై "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్న గీతార్థమును ప్రబోదిస్తూనే, మరోప్రక్క రాముడిని, ఇహలోక కారుణ్యమూర్తిగా, 'అబలను' చంపటమా? అని మూగవేదనకు లోనైన ఉత్తమ పురుషునిగా చిత్రించింది. అంటే పరలోక దైవీయ భావనను ఇహలోకమానవీయ భావనగా చేసి ఇహపర సమన్వయాన్ని సాధించి రాముడిని మానవీయ మూర్తిగా చిత్రించింది.

**సీతా స్వయంవరం** : మొల్ల రామాయణంలో అత్యంత రమణీయమైన ఘట్టం సీతాస్వయంవరం. జాతి సంరక్షణార్థమై భూదేవి వంటి ఇల్లాలికై సందడిగా వచ్చే రాజకుమారుల్ని చూద్దామా !

"కొందరు పల్లకీల మరికొందరు తేరుల నందలంబులం
గొందరు కొందరశ్వముల గొందరు మత్తగజేంద్రసంఘమున్
కొందరు స్వర్ణడోలికల గోరికనెక్కి నృపాలనందనుల్
సందడిగాగ వచ్చిరి బుజంబు బుజంబును ద్రోపలాడగన్'
బా - 66 - 26

సందడిగా వచ్చిన రాజకుమారులకు నిరాశే మిగిలింది. శివధనుస్సును ఎత్తలేక నిర్లిప్తత చెందిన రాజకుమారులకు శ్రీరాముని బాహువిక్రమము ఆశ్చర్యాన్ని కలిగించింది.

"చివ్వున మోపెట్టి గుణంబు పట్టి పటుబాహాశక్తితో దీసిన దునిగెన్" ఇటు శ్రీరాముని రాజకుమారులలో సాటిలేని మేటిగా చేసి సామాజిక మాన[illegible]నగా చేసింది.

**లక్ష్మణస్వామి చిత్రణం** : లోకంచేత మెప్పుపొందినవాడు తెలుగువారి గుండెల్లో నిలిచిపోయిన భావనామూర్తి లక్ష్మణుడు, మొల్ల రామాయణంలో లక్ష్మణుడు ఎంత సాత్వికుడో అంత పరాక్రమవంతుడు. మచ్చలేని మాణిక్యం. "సీత కోరికపై రాముడు మారీచుని వెంబడించిన సందర్భంలో హా! లక్ష్మణా! అన్న రాక్షసుని మాయమాటలకు కంగారుపడిన సీత చిత్రణ సగటు సామాన్య మానవకాంత కంగారు పడటాన్ని గుర్తుకు తెస్తుంది. తెలుగింటి ఆడపడుచు భర్తకు ఆపద సంభవించినపుడు పడే తొందరపాటు, మాటలలో అనాలోచిత సంభాషణను పోలి ఉంది. "భీతినొందకమ్మా జానకీ (35-49) అన్న లక్ష్మణుడి ఔన్నత్యాన్ని తూలనాడటాన్ని నాటి జన సామాన్యంలోని "దేవర న్యాయాన్ని" తలపింపజేస్తున్నది. అంచేతనే నేటికి తెలుగువారిళ్ళలో మరిది ఎదురైతే వదిన దూరంగా పోయే ఆచారం మిగిలింది. సీత తెలుగింటి ఆడపడుచుగా మిగిలి లోకపావని అయింది.

'కాలినూపురాలు తప్ప సీతమ్మ మచ్చలేని మరిదిని' అనరాని మాటలు అన్నందుకు మనస్సులోనే భాదపడే వనితగా మొల్ల రామాయణంలో కన్పిస్తుంది. రావణునిచేత

అపహరించబడి అ... ...లో తన్ను చూచుటకు వచ్చిన హనుమంతునితో లక్ష్మణు... ...న్ని గూర్చి చెప్పటంలో కొండంత ఎత్తు ఎదిగాడు.

"జనకుని భంగి రామనృపచంద్రుని నన్నును దల్లి... గని కొలువంగ నేర్చు గుణగణ్యుని లక్ష్మణు నీతిపారగున్ వినగనురాని పల్కు లవివేకము చేతను బల్కినట్టియా వినుత మహాఫలంబనుభవించితి నంచును తెటచెప్పుమా

...దర - 115 - 85

అంచేతనే లక్ష్మణుడు నేటికీ... ...వమైన, తమ్ముడిగా, మచ్చలేని మరిదిగా, గుణ సంపన్నుడిగా, నీతికారుడిగా, దీనులపాలిట కన్నతండ్రిగా, లోకంలో కన్పిస్తూనే వున్నాడు.

**కపులమానసిక వైచిత్రి :** హనుమంతుడు వాయువేగ మ...వేగంతో వెళ్ళి సీతను దర్శించి ఆమె ఇచ్చిన రత్నము తెచ్చి అ... ...నులకు చూపగా కోతులు రెట్టింపైన అమితోత్సాహంతో ...తులువేయుచు మధువనంలో విహరించిన తీరు ఎంతో స్వాభావికంగా వుంది.

"ఒక్కడాకొని కొమ్మలూచిన బండ్లెల్ల
జేకొని భక్షించునొకడు
ఒక్కడాకొని రేపుచున్నట్టి తేనియ
తడయక నొల్లాడి త్రాగునొకడు
ఒక్కడాకొని కోయుచున్నట్టకాయలు
మిన్నకయూటాడి మ్రింగునొకడు
ఒక్కడాకొని గోళ్ళనొలిచినట్టి చివుళ్ళు
బుక్కిళ్ళ కొలదిగా బొక్కునొకడు
తరువుపైనుండి తరువుదాటునొకడు
పండ్ల కెలుపంటి మ్రాకైన బ్రాకునొకడు
దిగువ గూర్చుండి తరవునకెగురు నొకడు
పెద్దవాడవున నుండి కుప్పించునొకడు"

సుందర - 223 - 107

మహాబలవంతులైన హనుమ, అంగదాదులను కూడ సామాన్య కోతులవలె చిత్రించి స్వాభావికతను పరిపోషించింది మొల్ల. ఆకలిచే కొమ్మలను అల్లాడించి తినేకోతులు, ఈగలను రేపుచూ తేనె త్రాగటం, పండినకాయలను మ్రింగుట, చిగుళ్ళను పుక్కిటలో పెట్టుకొనటం, చెట్టునుండి మరో చెట్టుపై ఎగరటం, క్రిందినుండి చెట్టుపైకి ఎగరటం. అసామాన్యమైన కపులను సామాన్యం లోకంతో సరిపోల్చి చిత్రించింది మొల్ల.

అంచేతనే మొల్ల ప్రతి అంశాన్ని సమకాలీన సమాజంతో ముడివేసి, రామాయణ మహా కావ్యాన్ని లోకంతో సమన్వయించి లోకసిద్ధిని సాధించింది. పురాణపురుషులైన రామాదుల దైవీయతను లోకంతో సమన్వయించి మానవీయ మూర్తులుగా, లోకపురుషులుగా, సజీవమూర్తులుగా, సమకాలీన సామాజిక వ్యక్తులుగా సామాన్యీకరించి లోకసిద్ధిని పొందిన మానవతా కావ్యంగా రామాయణాన్ని చిత్రించింది.

ఎ. వెంకటేశులు
*ఎం.ఎ.బి.యిడి., (పిహెచ్.డి) తెలుగు అధ్యాపకులు*
జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల,
కొట్టాలపల్లి - 515 870. అనంతపురం జిల్లా.



# పంపన తీర్చిన పాపన్న
## (దృశ్యకావ్య ప

తెలుఁగు పౌరుషాన్ని చాటిచెప్పే 'సర్దార్ పాపన్న' అను ఈ దృశ్యకావ్యం తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి నందుకున్నది. దీని రచయిత శ్రీ పంపన సూర్యనారాయణ. ఈతడు బాలసూర్యుని వలె తన కవితా ప్రతిభను పరిచి సకల జన సమ్మోదంగా ఈ దృశ్యకావ్యాన్ని రచించాడు.

### కవి-కవితా స్వరూపం

పంపన సూర్యనారాయణగారి జన్మస్థలం రామ చంద్రాపురం. చిన్ననాట జానపదజీవనం సాగించి క్రమేపి కడుపునిండా పాండిత్యం సంపాదించిన కృషీవలుడు. కపాలంనిండా కవిత్వం, చేతినిండా ప్రతిభ పండించుకున్న ఈతని కవిత్వపు నడక నల్లేరుపై బండి. జానపదం, ప్రాచీనం, ఆధునికత అనే మూఁడు ప్రవాహాలను ఒకచో చేర్చి త్రివేణీ సంగమ ప్రతీకగా ఈ దృశ్యకావ్యాన్ని రచించాడు. ఆ వైనాన్ని "స్థాలీపులాక" న్యాయంగా మీ ముందుంచటం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

### మూలకథ

రాగిరేకులు, రాతి పలకల్లో దాగియున్న జానపదగాథను వెలికి తీసి వ్యాసరూపంలో సూటిగ, నీటుగ ఆంధ్రులకందించిన "శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ" గారి వ్యాసం ఈ నాటక నిర్మాణానికి ఆధారం. గొడ్లనుకాసే పాపన్న కులవృత్తి కల్లుగీయటం. ఈతని తల్లి సర్వమ్మ, బంగారమ్మ అనే చెల్లెలుంది. ఈతని చిన్ననాటనే తండ్రి గోల్కొండ నవాబు దుర్మార్గానికి బలికాగా వయసు వచ్చిన తరుణంలో తన చెల్లెలు భర్తను కూడా నవాబు చంపేస్తాడు. ఇట్లా చూస్తూ ఊరు...టే ఎన్ని కుటుంబాలు నాశనమౌతాయో అని పరాక్రమించి, యువతను మేల్కొలిపి శౌర్య సాహసాలను వెలయించి దుర్గాధిపతియై సంకల్ప సిద్ధిని పొంది తుదకు దైవమర్వి పాకమున వీరమరణం పొందిన శౌర్యకిశోరం "సర్దార్ పాపన్న".

చారిత్రక సత్యాన్ని వక్రీకరించకుండా సహజ కల్పనలతో, పాత్రోచితభాష, అధునాతన ఆలోచనలతో ... జీవంపోసి తన పాండితీ ప్రతిభతో ఈ దృశ్య కావ్య... రసజగత్తును సమ్మోహింప చేశాడు కవి.

### ...గత అంశాలు

I. జానపదం: ... దయంనుండి అనుభూతి విషయాలను ఆర్ద్రతా ... ఆవేశనిహితంగా, అనుభూతి దాయకంగా, ... మాస్యంగా, సరళంగా, సంయమనంతో ఆయా ... వనుసరించి వస్తువు నందించటం జానపదుల స్వభా... స్వతహాగా జనపదుడు కనుక ఈ అంశాన్ని స్వాభావికంగా నాటకంలో నిహితం చేశాడు.

పీ. నాటక వస్తువును జానపదగేయ గాథను... ...

ఆ. సందర్భానుకూలంగా వీరు ప్రయోగించిన సామెతలు అవి కూడా పల్లీయుల జీవన సాన్నిహిత్యాన్ని కలిగియున్నవే. ఉదాహరణకు

"కోటనెక్కడమంటే కోతికొమ్మచ్చి యాడుటయా"

"తాటి ఎత్తు ఎగిరినానంటే తారాజువ్వే ఎగుర

మన్నట్లుంది"

"కాళ్ళుకడుగుకోటానికి ముంతలేదుకాని కల్లుకు కళాయిగిన్నె కావాలన్నాడట" మొ॥

ఇ. సంభాషణలలో కూడా కవి తన జానపద సాన్నిహిత్యాన్ని వ్యక్తీకరించాడు.

నవాబుసైన్యం పశువులగుంపుపై దాడిచేయగా "పాపన్న" మిత్రుడుపైడప్ప. పాపన్న దగ్గరకు పరుగెత్తుకొచ్చి రొప్పుతున్నాడు. ఆ సందర్భంలో "పశువుల మందలోకి పులి వచ్చిందా?" అని తెలగన్న ప్రశ్నించాడు. "లేగదూడల్ని తమ తల్లులకు దూరంచేయవద్దని బ్రతిమాలినా లక్ష్య పెట్టలేదు" హనుమంతు ఆవేశంతో దూడల్ని విడిపించినప్పుడు 'గొడ్డనుబాదినట్లు బాదారు" అని పైడప్ప సమాధానం చెప్పాడు. "మాంసానికి లేగదూడలే కావాలా! ఎంత కసాయివాళ్ళు. లేగదూడలని జాలిలేదే! తమ దూడలకై గోమాతలు అలమటిస్తూ అరుస్తూ అరుస్తున్న అరుపు విని నోరులేని సాధుజీవాలకు దూరం కావలసి వచ్చుచున్నది' అంటాడు తెలగన్న. ఇట్టి సంభాషణలలో పల్లీయుల నిష్కల్మష, అమాయక హృదయం, కరుణామయ జీవనవిధానం చక్కగా ఆవిష్కరించాడు.

ఈ. సంభాషణలలో నాటి సామాజిక స్థితిని కూడ తెలిపాడు కవి.

పాపన్న మిత్రులు గొడ్లను కాస్తూండగా వారి నడుమ జరిగిన సంభాషణ గమనించండి.

పాపన్నః "అవును. తెలగన్నకు పశుపక్ష్యాదులపై వల్లమాలిన జాలితో కూడిన ప్రేమ. మేతమేయుచున్న గోమాతల్నీ పాలు త్రావుచూ మధ్యలో గంతులేయుచున్న లేగదూడల్ని చూస్తూ వైమరచి పోవునానందమును అనుభవించుట తెలగన్న హృదయ లక్షణం."

హనుమంతుః "ప్రశాంత జీవితమునకు దూరమగుటను మంచి గోమాతలపైగల మమకారము నిన్ను బాధించు చున్నది."

పాపన్నః "నీవు శాస్త్రుల్లుగారింట్లో పనిచేయడం, వారి వెంట గుళ్ళో పురాణానికి వెళ్ళడం నీకు బాగా పనికివచ్చాయి.'

ఇట్లా సంభాషణలద్వారా నాటి సామాజిక పరిస్థితులను తెలిపాడు. శాస్త్రుర్లగారింట్లో పనిచేసిన తెలగన్నను కొంత విజ్ఞాన వంతునిగా తీర్చిన సందర్భం వచ్చినప్పుడల్లా ఆతనిచేత "పగయువగయు లేక ఏపాటిగన్న అలరు సామాన్య సంసారి యగుట మేలు" అని కృష్ణరాయలన్నారు మొ॥ మాటలు పల్కించి కవి తన సాహిత్య అభినివేశాన్ని తెలుపుకుంటూ ఆయా సందర్భాలలో కాళిదాసు, భగవద్గీతలను కూడా గుర్తుచేశారు.

II. ప్రాచీనంః ప్రాచీన గ్రంధాధ్యయనం చేసినకవి తల్లక్షణబద్ధంగా రచన సాగించారు. నాటక ప్రారంభంలో నాందీ ప్రస్తావన చెప్పటం, అంకవిభజన చేయటం ప్రాచీన పద్ధతి. శ్రీ సూర్యనారాయణగారు తమ నాటకాన్ని లక్షణాను గుణంగా ఐదు అంకాలుగా విభజించారు. ప్రథమాంకంలో నాంది, ప్రస్తావనలు రచించారు.

అ. నాందిః తే.గీ.ః ధూళి తెగజిమ్మియాడగా దుమ్ము
దులిపి ఎత్తుకొను యశోదకు హస్తమెత్తి, కోటపై
నెగురుచుండిన హనుమధ్వజము జూపు పాపడు
సభాసదులను గాపాడుగాక!

ఇందు శిల్పం అమోఘమై అందరికి ఆనందం కలిగించేదిగా ఉంది. బాలకృష్ణుఁడు పండిత పామరులదరికి ఆనంద దాయకుడే కదా! బాలకృష్ణుని బాల్యక్రీడలన్నీ జనోపకారకములే అయినట్లు హనుమద్భక్తుడైన పాపన్నకూడా పరోపకారార్థం నడుంకట్టి శౌర్యాన్ని ప్రదర్శించి

విజయం సాధించాడని తెలిపేందుకు విజయకేతనాన్ని చూశాడు. ''ధూళితెగ జిమ్మియాడగా'' అనటంలో గోల్కొండ నవాబు దౌష్ట్యాలను తెలుపుతూ 'దుమ్ముదులిపి' అనుటచే గొడ్లు కాచుకొను సామాన్యవ్యక్తి అయిన పాపన్న ఉన్నత లక్ష్యప్రేరితుడై శౌర్యసాహసాలను వెలయించి దుర్గాధిపతియై తనతల్లికి ఆనందాన్ని కలిగించిన వైనం ఇందులో గోచరిస్తుంది. ''పాపడు'' అన్న పదంద్వారా ''పసిపాప'' అని ''సర్దార్‌పాపన్న'' అని శ్లేషను ఉపయోగించుకున్నారు.

ఆ. ప్రస్తావనః ''ఆటల్‌పాటలు కట్టి పెట్టుమిక పాపన్నా!.. ''కొడితే గోల్కొండ కొట్టన్‌వలెన్'' అంటూ సూచనాత్మకమైన పిలుపుతో భవిష్యత్తులో పాపన్న కర్తవ్యం తెలుపబడింది.

ఇ. సూత్రధారుడుః నాంద్యంతంలో సూత్రధారుడు ప్రవేశించి ''చిత్తశుద్ధితో ఆత్మవిశ్వాసం, సామాజికమైన ఆలోచనా సరళి కలిగియున్న పంపన సూర్యనారాయణ రచించిన సర్దార్ పాపన్న నాటకాన్ని సంస్కార వంతులైన సభ్య మహాశయుల సమక్షమున నటనా కళాపారీణులైన సహచరులతో ప్రదర్శింపబూనుట ప్రతిభా, వ్యుత్పత్తి, అభ్యాసములు ఏకత్ర రాశీ భూతమగుచున్నట్లున్నది. అదిగో నటి వచ్చుచున్నది.' అంతలో నటిరాగా ఇరువురి సంభాషణలలో ఈ నాటకముయొక్క స్వభావాన్ని చెప్పించుట శాస్త్రబద్ధము.

ఈ. నాయకుడుః నాయకుఁడు ధీరోదాత్తుడుగా ఉండుట శాస్త్రసమ్మతం. ఇందులో నాయకుడైన పాపన్ననేగాక అతని మిత్రులైన కోటయ్య, తెలగన్న, అలీఖాన్ మొదలైన యువకులు కూడా ధీరోదాత్తులుగా రూపుదిద్దుకొన్నారు. ఒక సందర్భంలో చెల్లి ఇంటికి వచ్చినపుడు పాపన్న మరదలైన వసంతకు అతనికి జరిగిన సంభాషణలో ''జన్మజన్మాలకు కార్యసాధనమును మించినట్టిది లేదు ప్రపంచమందు ఆరు మూడైనగాని మూడారుగాని చెక్కుచెదరక నడుపుము స్వీయరథము''. అంటూ ఆమెను ప్రబోధిస్తాడు. ఇందు కార్యనిర్వహణపై పాపన్నకున్న ఏకాగ్రత, స్థిరనిశ్చయం ఆయన ధీరోదాత్తతకు నిదర్శనం.

ఉ. రసంః ఇందు ప్రధానరసం ధర్మవీరం. కరుణ, శృంగారాలు అంగరసాలు, ఉద్యమ నిర్మాణం, నవాబుపై యుద్ధ సమయంలో వీరరసం పరిపుష్టిచెందగా ఉద్యమ నిర్మాణానికి ముందు కరుణ, వసంత, పాపన్న, వారి మిత్రుల సంభాషలలో సంస్కారవంతమైన శృంగార, కరుణలు జాలువారాయి.

ఊ. ముగింపుః ''మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని అనికదా! శాస్త్రం. తదనుసారులైన పంపనకూడా నాటకం ముగించటం (పాపన్న మరణం వాచ్యం చేయకుండా) శాస్త్రంపై వారికున్న 'విశ్వాసాన్ని తెలుపుతున్నది. అయితే మూలంలో పాపన్న మరణ విషయంలో తానే కత్తితో పొడుచుకుని ప్రాణత్యాగం చేశాడని, అట్లుగాక నవాబు ముక్కలుగా నరికించి కోటగుమ్మానికి కట్టించాడని భిన్నాభిప్రాయాలున్నాయి. ఇట్టి సందర్భంలో కవి తన శాస్త్ర పరిజ్ఞానంతో మూలానికి నష్టంవాటిల్లకుండా ప్రతిభావంతంగా తీర్పునిచ్చారు. గమనించండి. అంతిమ ప్రకరణంలో సంభాషలు ఇలా సాగాయి.

తెలగన్నః సర్దార్ పాపన్నగారి కుడిభుజం తెగి పోయింది. వీరహంవీరుఁడైన కోటయ్య ఫిరంగి గుండుకు ఆహుతై పోయాడా!

వసంతః నవాబుసైన్యం ఉత్తర పడమర ప్రాకారాల వద్ద కేంద్రీకృతమైంది. సర్దార్ పాపన్న అక్కడికే చేరాడు.

తెలగన్నః పాపన్నగారక్కడ ఉంటే కోటకు ఏ అపాయమూ లేనట్టే

అలీఖాన్ః (తిరిగివచ్చి) ఏదో కుట్రజరిగింది. మన బందీలందరు కారాగారంనుండి (ఉత్తరద్వారం ద్వారా) పారిపోతున్నారు.

తెలగన్నః ఎంతమోసం

అలీఖాన్ః ఎవరి ఉప్పూపులుసుతిని ఈ శరీరం పెరిగిందో వారికే దీనిని అర్పిస్తాను. అప్పుడే తృప్తి. సార్థకత.

తెలగన్నః ఉత్తర ప్రాకారం కూలిపోవుచున్నదే!

ఈ సంభాషణలు పరిశీలించినట్లైతే సంప్రదాయాభిమాని అయిన కవి పాపన్న మరణాన్ని వాగ్రూపంగా వ్యక్తపరచిన ముగింపు అమంగళకరమై శాస్త్ర విరుద్ధమని భావించారు. అట్లని కొందరు పెద్దలు అభిప్రాయపడినట్లు పాపన్న మరణాన్ని చెప్పలేదనటం సత్య విషయంకాదు. నవాబు కుట్రపన్ని మోసంతో పాపన్నను కోటయొక్క ఉత్తర ద్వారం యొద్ద వధించాడని కవి ధ్వనింపచేశాడు. ఇది కవి ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శనం. అంతేగాక పాపన్న మరణవార్త ఉద్యమాన్ని నష్టపరచే అవకాశమున్నందున దానిని మాటువరచి భవిష్యదుద్యమ నిర్మాతలకు సందేశాన్ని అందజేశారు.

ఋ. కల్పనలుః మూలానికి నష్టం కలుగకుండా దృశ్యానుకూలంగా మార్పులు చేయటం కవి ప్రతిభకు నిదర్శనం. మూలంలో పాపన్న నిద్రించు సమయంలో పన్నెండు తలలనాగుపాము పడగ వట్టిందట. అది అతడు భవిష్యత్తులో రాజుకానున్నాడని తెలిపిన సంఘటనను కవి స్వప్నవృత్తాంతంగా మలచి ప్రదర్శన యోగ్యత కల్పించారు. మూలంలోలేని వసంత పాత్రను సృష్టించి తెలుఁగు పౌరుషం పుణికి పుచ్చుకున్న వీరవనితగా తీర్చిదిద్దారు. డబ్బుకోసం తల్లిపై కాగేనూనె పోసి బాధించినట్లున్న మూలాన్ని వదిలేసి పాపన్న ధీరోదాత్తతను పరిరక్షించారు.

అ. నిర్వచన వాక్యాలు సంభాషణలలో చూపించటం. ఉదాహరణకు "చేసినపనిని తిరిగి చేయక పోవటమే నిజమైన పశ్చాత్తాపం", "బ్రతుకవలసినంతకాలం బ్రతకడమే బ్రతుకు లక్షణం", "నీమీద అంత ప్రేమ ఉంది ఇంతప్రేమ ఉంది అని చెప్పటం అల్పుల లక్షణం"

ఆ. సామెతలను ప్రయోగించటమేకాక వెంటనే వివరించటం. ''ధనమూలమిదం జగత్'' డబ్బుఉంటే కొండమీద కోతిని కూడా రప్పించవచ్చు. "చెప్పుక్రింద తేలు" లాగా అణిచిపెట్టాను. అట్లాగే పదానికి కూడా " అమలుదారు" అంటే పన్నులు వసూలుచేసే ఆసామి. ఇట్లా పామరులకు కూడా సులభంగా అర్థమయ్యే పద్ధతిని అనుసరించటం వీరి నవ్యత.

ఇ. సమతావాదంః "ఏ వ్యక్తి దగ్గరనుండైనా కోరతగ్గది నీతి, నిజాయితీలుకాని కులమతాలుకావు'' "శాంతి,సత్యాహింసలు మతప్రబోధాల లక్ష్యం. కనుక మత భేదాలెన్నుట తెలివితక్కువ" ఈ విధమైన సంభాషణల ద్వారా సమకాలీన పరిస్థితులను దృష్టియందుచుకొని సార్వకాలికమైన సమతాభావాన్ని అందించటం కవి బుద్ధి కుశలతకు నిదర్శనం.

ఈ. జాతీయభావంః 'ఎవరైతే తన కుటుంబంకోసం తన జీవితాన్ని గ్రామంకోసం కుటుంబాన్ని, దేశంకోసం గ్రామాన్ని, త్యాగం చేయగలరో వారే నిస్వార్థపరులు' అని పాపన్న పల్కిన పల్కులు జాతీయభావ ప్రబోధకమైన కవి పాండిత్యాన్ని తెలుపుతున్నాయి.

ఉః ఉద్యమ నిర్మాణంః ఆశయ సాధనకోసం ఉద్యమం నిర్మింపబడుతుంది. దానిని నడిపే నాయకుడు సమర్థుడైతే బలపడుతుంది. అసమర్థుడైతే బలహీన పడుతుంది. ఉద్యమ నిర్మాతలకు ఉన్నత ఉద్యమకారునిగా సర్దార్ పాపన్న సందేశం ఆలకించండి. "ఊళ్ళమీదపడి దోచుకుంటే నవాబు సైన్యానికి మనకు తేడా ఏమిటి? కనుక కొందరు

ధనికుల్ని తమకు తోచిన సహాయాన్ని మన ఉద్యమానికి అందజేయవలసినదిగా కోరండి. ఉద్యమానికి ప్రజల సానుభూతి ఆయువు పట్టు అగునట్లు మనలుకోవాలిగాని ద్వేషభావం ప్రబలునట్లు వర్తించకూడదు. మనం ఇకముందు వాళ్ళమీదపడి దోచుకుంటున్న నవాబు సైన్యమును దొంగచాటుగా అటకాయించి వాళ్ళగుఱ్ఱాల్ని, ధనాన్ని స్వాధీనం చేసుకోవాలి. గూట్లో దొంగిలించిన వాళ్ళు వాళ్ళయితే ఒళ్లో దొంగిలించిన వాళ్లు మనం కావాలి'' (35పే)

మద్యపానం: ''జాతిని బలహీన పరచే వ్యసనం మద్యపానం. అందువల్ల దానిని విడిచిపెట్టి మన స్థైర్యంతో చైతన్యవంతులం కాగలమ''ని హితవు చెప్తాడు పాపన్న. ఏకాలంవారైనా ఆచరింపతగిన తెలుగన్న వాక్యాలు గమనించండి. ''ఏదైతే అలవాటుపడితే మానుకోలేమో అదే వ్యసనం. దాని మంచిచెడ్డలను బట్టి ఒక మనిషి బాగోగులుంటాయి. చెడ్డదని తెలుసుకున్న అట్టి వ్యసనాన్ని విడచిపెట్టటం పాపన్నకే చెల్లింది. పాపన్నవలెనే మనము కూడా ఇప్పటినుండి త్రాగుడు కట్టిపెట్టాలి'' (32పే)

స్త్రీ అభ్యుదయం: ''ఆడవాళ్లను పచ్చడి నూరడానికే పనికివచ్చేటట్లు తయారుచేస్తారు. కాని అవసరమైతే దేనికయినా సిద్ధపడేటట్లు తయారుచేయరు. నిజానికి స్త్రీలకున్న ఏకాగ్రత, అవగాహనాశక్తి పురుషులకు లేవేమో అనిపిస్తుంది నాకు. ఆడవాళ్ళు పూనుకుంటే చేయలేనిది ఏమీలేదు. అని పాపన్న తన చెల్లెలుతో పలికిన మాటలివి. దీనివల్ల స్త్రీ అభ్యుదయం ''యత్రనార్యస్తుపూజ్యంతే'' అన్న భారతీయసంస్కృతి సంప్రదాయాసక్తి వెల్లడియౌతున్నది.

ఈ విధంగా ''సర్దార్ పాపన్న'' దృశ్యకావ్యాన్ని శాస్త్రీయ పద్ధతిలో గద్య పద్యాత్మకంగా రచించినా స్వతంత్రించి సమకాలీన సమాజ సమస్యలపై దృష్టిసారించి ఔచితిని పోషించి, సరసంగా జానపదగాథను సూటిగా, నీటుగా, వీరరసస్ఫోరకంగా సర్వజనసమ్మోదకరంగా ఆంధ్రుల కందించిన శ్రీ పంపన సుర్యనారాయణ అభినందనీయుడు.

డా॥ సాగి ఆంజనేయశాస్త్రి
తెలుగు ఉపన్యాసకుడు
గీతా విజ్ఞాన ఆంధ్రకళాశాల
రామగిరి, నల్లగొండ - 508 001.



# "వెంకటేశ్వరుడు - మిఠాయీగొరంగో

హిందీ మూలం: శ్రీమతి పొరనంది నిర్మల

తెలుగు అనువాదం: శ్రీ కె.వి.యస్. రఘుపతిరావు

అఖరికి భగవంతుడు మాకు టెలిఫోను చేసి, ఆయన చరణారవిందములతో శనివారంనాడు మాగృహాన్ని పావనం చెయ్యడంకోసం వస్తున్నారని నికరంగా చెప్పేరు. శుక్రవారం "అమ్మ వారికి" ఇష్టం, శనివారం "వేంకటేశ్వర స్వామికి" ఇష్టం. రెండు రోజుల్లోనే వారు వారింట్లోలోగాని. పైనగాని అడుగు పెడతారు.

అహా! ఏమి మా భాగ్యం!స్వయంగా శ్రీ వేంకటేశ్వర స్వామి మాయింటికి వస్తున్నారు. ఇది ఎన్ని జన్మాల పుణ్యఫలమోకదా! ఈ కాలంలో ప్రజలకు భగవంతుని దర్శనం చేసుకోడానికి కూడా తీరికే దొరకడం లేదు. అందుకేనేమో భగవంతుడే భక్తుల్ని దర్శించుకోడానికి భూలోకం వస్తున్నాడు. ఇంకోసంగతే మిటంటే పూజారి ఆయన్ని "హవుస్ అరెస్ట్' చేసేడు, కొంచెంకూడా ఊపిరి పీల్చుకోడానికి వీలుండదు. ధూప, దీపాల వాసనలతో ఊపిరి ఆడదు. అప్పుడు భగవంతుడు స్వచ్ఛమైన గాలిని పీల్చుకోవడం కోసం ఆయనకి అత్యంత ప్రీతిపాత్రమైన పుణ్య భూమియైన "ఆంధ్రప్రదేశ్"లో విహరిస్తారు. అప్పుడప్పుడు కొంతమంది భక్తులను మెచ్చి వారికి "సర్‌ప్రైజ్ విజిట్ ఇస్తూంటారు. ఒకేరకమైన పూలు,పళ్ళు నైవేద్యంగా స్వీకరించడం వల్ల జిహ్వాకి. రుచితెలియకనేమో, నవరుచులను ఆరగించడంకోసం ఎవరో పుణ్యాత్ముని తలుపు తడుతుంటారు. అప్పుడప్పుడు కలలోకనబడి "ఎడ్వాన్స్"గా ఫలానా ఇంట్లో ఫలానా వ్యక్తిలో ప్రవేశిస్తానని చెప్తుంటారు.

భారతదేశం అనాదిగా అనేకతకై విశ్వవిఖ్యాతి గాంచింది. ఇక్కడ అనేక భాషలు మాట్లాడేవారున్నారు. రకరకాల ప్రజలున్నారు. రకరకాల ఆహారపు టలవాట్లు న్నాయి. ఇక్కడ ఎవరికి ఏమతం ఇష్టమో ఆ మతాన్ని స్వీకరించవచ్చు. యథేచ్ఛగా ప్రచారం చేసుకోవచ్చు.

నామందమతి, మతిమరుపు చేత ఈ విషయం చెప్పడమే మరచిపోయేను. ప్రపంచంలో ఒక్కొక మతంలోను ఒక్కొక దేవతకు పూజలు చేస్తుంటే మన పవిత్ర వసుంధరలో 33కోట్ల దేవుళ్ళు, దేవతలు లెఖ్ఖకు దొరికితే, రమారమి 20-25 మంది కొత్త దేవుళ్ళు దేవతలు కూడా తమ పేర్లను జాబితాలో రాయించేసుకున్నారు. ఒకమాట మాత్రం నిజం. జనాభా ఎంత పెరిగితే దేవుళ్ళు, దేవతల సంఖ్యకూడా, అంతే పెరగాలి. లేకపోతే ఒకే దేవుడో, దేవతో ఇంతమంది ప్రజల ప్రార్థనలను ఎంత కని వినగలుగుతాడు? ఎంతకని వారి కోరికలు తీర్చగలుగుతాడు? అందరు దేవుళ్ళు, దేవతలు కలిసి ఒక "రిజల్యూషన్" పాసుచేసుకున్నారు. "భారతదేశంలో ఎవరికి నచ్చిన దేవుడిని, దేవతను వారు ఆరాధించవచ్చు.

ఇప్పుడు దేవతలలో పరుగు పందెం ఆరంభమైంది. ఏదేవుడో, దేవతో మొట్టమొదట ఏ ప్రాంతం మీద కాలుమోపితే అక్కడ అధిష్ఠాన దేవతగా అయిపోతాడు. ఇంత కన్న "ఉదార హృదయం" మన కెక్కడైనా దొరుకుతుందా? ఎలాగో ఒకలాగ వారు ఆ ప్రాంతానికి "అఫీషియల్" దేవతలయిన్నప్పటికీ మిగిలిన దేవీ, దేవతలను గూడా పూజలో తీసుకురావచ్చు. ఉదాహరణకు మహారాష్ట్రలో గణపతిని పూజిస్తారు.

వంగదేశంలో దుర్గను, కాళిని పూజిస్తారు. ఉత్తరప్రదేశ్‌లో రాముడు, కృష్ణుడు, దక్షిణంలో మురుగన్, అయ్యప్పన్ అయితే ఆంధ్రప్రాంతంలో వెంకటేశ్వరస్వామి ఆయన భార్య అలువేలు మంగ. ఆమెను "అమ్మ" రూపంలో కొలుస్తారు. దేవతలైనా, మానవులైనా దంపతులను విడదీయకూడదు. ఆంధ్రులకు అది బాగా తెలుసును.

దేవుడు కూడా అంతెత్తైన పర్వతాల్లో ఉండి వుండి విసుగు చెంది ఆంధ్రప్రదేశ్‌లో టూరు కొడుతుంటాడు. అప్పుడప్పుడు ఎవరో ఒక భక్తుడిలో ప్రవేశించి తన ప్రతాపం చూపిస్తుంటాడు. ఇది వారి వారి విశ్వాసం. మనం స్వతంత్రదేశంలో స్వతంత్ర పౌరులం. మన విశ్వాసాలు కూడా స్వతంత్రమైనవే! మనం ఎవరినైనా విశ్వసించవచ్చును. విశ్వసించక పోవచ్చును. భగవంతుడు తన భక్తులకు ఎంతో స్వేచ్ఛను ఇస్తాడు. ఎటువంటి చచ్చుప్రశ్న వేసినాగాని సమాధాం చెప్పడానికి సిద్ధంగా వుంటాడు. ఆయనతో "ఫ్రీస్టైల్" ఇంటర్వ్యూ తీసుకోవచ్చు.

ఫలానా ఇంట్లో ఫలానావారిపై భగవంతుడికి కృపకలిగింది, వారిలో భగవంతుడు ప్రవేశించాడు. అనే వార్త మరునాటికి తెలుస్తుంది. ఆయన వయసు మారిన వారైనా, వయసులోని వారైనా ఆఖరికి 3 సంవత్సరాల పిల్లల్లోనైనా ప్రేశించగలరు. శరీరం చిన్నదైనా, పెద్దదైనా కావచ్చు. వయసులో కూడా చిన్నైనా, పెద్దైనాకావచ్చు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినట్టు స్త్రీలైనా, పురుషులైనా ఆత్మ "సైజు" మాత్రం అందరికీ ఒకటే! అయితే ఒక మాట మాత్రం గర్తుంచుకోండి. భగవంతుడు ఎప్పుడూ స్త్రీలలోనే ప్రవేశిస్తుంటాడు. ఆయన అమృత మంధన సమయంలో "మోహిని"గా రూపందాల్చటం దీనికి కారణం కావచ్చు. అందువల్ల పూర్ణానందం పొందలేక పోవటం వల్ల కలియుగంలో పర్వతాలపైన కట్టిన గుడినుంచి దిగి ఎవరో ఒక స్త్రీలో ప్రవేశించి అతని కోరిక తీర్చుకుంటున్నాడు.

మా దూరపుచుట్టం ఒకావిడవున్నారు. వరసకి పిన్నత్త గారవుతారు. ఆవిడకు మొగుడు వదిలి పెట్టిన ఒక కూతురు కూడా వుంది. ఆవిడ భర్తపోయి చాలాకాలం అయ్యింది. పెన్షనుతో వాళ్ళిద్దరూ రోజులు గడపుతున్నారు. పేదరికంలోనే చాలా కాలం గడిపేరు. ఏదీకూడా తృప్తిగా తినలేక పోయేవారు. ఒకరోజు వేంకటేశ్వర స్వామి ఆవిడకూతురు కలలో కనిపించి 'నీ భక్తికి మెచ్చాను. మీ ఇంటికి అప్పుడప్పుడు వచ్చి నిన్ను ఆవహిస్తుంటాను.' అని చెప్పాడట. ముసలావిడ ఇదివిని పూర్తిగా అర్థం చేసుకోలేక పోయింది. మొదట్లో ఎవరికీ తెలిసేదికాదు గాని తరువాత తరువాత వాళ్లింటికి దేముడు వచ్చి వెళుతున్నాడన్న వార్త ఊరంతా వ్యాపించింది. శుక్రవారమో, శనివారమో ఏరోజైతే మా పిన్నత్తగారి అమ్మాయిని దేముడు ఆవహిస్తాడో ఆరోజు వాళ్ళింట్లో ఆడవాళ్ళ జాతరలా వుంటుంది. ఎవరి సమస్యల గురించి వాళ్ళు ప్రశ్నలు వెయ్యడం ఆయన సమాధానాలివ్వడం ప్రసాదం వగైరా పెట్టి హారతులివ్వడం జరుగుతోంది. అదేకాలనీలోని గుడిలోవుండే గణపతి (స్వామి)కి కూడా కోపం వచ్చింది. తనకు జరగవలసిన భోగాలు ఆ అమ్మాయికి జరుగుతున్నాయనే ఈర్ష్యకూడా ఆయనకుంది. ఆయన కూడా భక్తుల మొరవిని విచారణ జరుపడం "సస్పెండ్' చేశాడు. మాపిన్నత్తగారి కూతురికి కూడా కొన్ని శక్తులు వచ్చినట్లున్నాయి. అందువల్ల ఆమె చెప్పే సమాధానాలలో 75శాతం నిజమవుతున్నాయి. ప్రతి ఒక్కరూ ఖాళీవేళల్లో ఇదే విషయం గురించి మాట్లాడుకుంటున్నారు. ఎందుకంటే వాళ్ళ ఆర్థికపరిస్థితి అందరికీ తెలిసిందే. దయతోనో లేక సానుభూతితోనో, కృతజ్ఞతతోనో ఏదో ఒకటి ఇచ్చినవాళ్ళే వాళ్ళంతా. శ్రీరాముని పాత్ర ధరించిన వాడు కూడా నిజంగా శ్రీరామునిలాగే కనిపిస్తాడు. బహుశా భగవంతుడు

కూడా ఆమెలో ప్రవేశిస్తూ ఏదో గుప్తరూపంలో ఆమెకు వాక్శుద్ధినిచ్చేడేమో!

ఒకసారి నేనుకూడా వెళ్ళి చూడడం జరిగింది. మాయింటికి కూడా దేముడు వస్తేఎంత బాగుండునో అని అడిగేను. అప్పుడతను ఒక చిరునవ్వునవ్వి, తలవూపి తన స్వీకారాన్ని తెలియజేశాడు. ఇక్కడ దేముడు శుక్రవారం వస్తున్నాడని చెప్పేనుకదా! కొన్ని కారణాంతరాల వల్ల శనివారం మాత్రమే వెంకటేశ్వరస్వామి రూపంలో రాగలడు. ఈ విషయం కూడా "ఇన్ ఎడ్వాన్సు" (స్వామి) ద్వారా తెలియ జేయబడింది. ఈ విషయం మా ఆయనకు చెప్పలేదు. ఎందుకంటే ఆయన మనుషులమీదకు వచ్చే దేముణ్ణి నమ్మరు.

నేను శనివారం స్కూలుకి శెలవు పెట్టి మావారు యూనివర్సిటీకి వెళ్ళిన తరువాత ఇల్లంతా శుభ్రంగా కడిగి, ముగ్గులుపెట్టి, చాపలువేసి దేముడికోసం, ఒక జాగా కేటాయించి అక్కడ అష్టదళపద్మం వేసి, పూలదండలు, ప్రసాదం తయారుగావుంచేను. ఈ సంగతి కొందరికి చెప్పేను. వాళ్ళకోసం కూడా కాఫీ, టీ వగైరా తయారుగా వుంచి దేముడికోసం ఎదురు చూస్తున్నాను. "ఇండియన్ పంక్చ్యుఆలిటీ"ని పాటిస్తూ దేముడు ఒకటిన్నర గంటలు లేటులో వచ్చేడు. కారణమేమిటంటే చినవాల్తేరు నుంచి బి.హెచ్.పి.వి.కి. చాలా దూరం బస్సులో రావాలి. బస్సుల గురించి రాయడం మొదలు పెడితే అసలు సంగతి మరచిపోతాను. అందుకే ఆనింద బస్సులమీద వేసి, నేను నిశ్శబ్దంగా వూరుకోవడం శ్రేయస్కరం అనుకున్నాను. దేముడు పూనబోయే మా పిన్నత్తగారి అమ్మాయికి మంచినీళ్ళు వగైరా యిచ్చి ఆవిడ శ్రమ, అలసట కాస్తపోగొట్టేను. ఈలోగా అందరూ వస్తున్నారు. ఇప్పుడు "గ్రీన్‌రూమ్" అంటే మా బెడ్‌రూమ్‌లో ఆవిడ మేకప్ అవుతూ కట్టుకోడానికి ఒక పట్టుచీర పైమీద వేసుకోడానికి ఒక పట్టుశాలువ ఇమ్మంటే ఇచ్చేను. అవి అలంకరించుకొని-ఆసనం మీద కూర్చుంది. దేముడి పాత్ర వెయ్యడానికి నేను బొట్టు పెట్టి, పూలదండ మెళ్ళోవేసేను. కొందరు పాదాలు కళ్ళకద్దుకున్నారు. గదంతా అగరొత్తుల వాసనతో నిండిపోయింది. నైవేద్యం ఆవిడ దగ్గర పెట్టేను. అందరూ భజన జేస్తూ-స్తోత్రాలు చేస్తున్నారు. భగవంతుడు చమత్కారం చెయ్యాలను కున్నాడేమో! మండుతున్న కర్పూరం నోట్లో వెయ్యమన్నాడు. నాలికి కాలిపోతుందేమోనని నేను భయపడ్డాను. ఎందుకంటే అలాగైతే ఆ తరువాత యే పదార్థం తిన్నా రుచి తెలియదు. ఒక చేతిలో గ్లాసుతో నీళ్ళు తాగి మింగేశాడు. తన కుడిచేతిని చూపిస్తే అందులో గుండ్రంగా కాలిన మచ్చకనబడుతోంది. మా పిన్నత్తగారిని అదేమిటి అలావుంది అని అడిగితే క్రిందటి శనివారం దేముడు చేతిలో కర్పూరం వెలిగించమన్నాడు అదే ఆ మచ్చ అన్నాడు. ఎవరికైనా అయితే ఆ చెయ్యంతా కాలేది! అదే మనిషికీ భగవంతుడికీ తేడా! వచ్చిన వాళ్ళంతా శ్రద్ధా భక్తులతో ఒకసారి నమస్కరించి దేముడి కోసం తెచ్చినవి సమర్పించి తిరిగి ఎవరిస్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. మావారు వచ్చేటైమైందని నాకు భయంవేస్తోంది. అప్పుడు "దేముడికి ఈ రోజు ఆరోగ్యం బాగులేదు. ప్రశ్నలకి జవాబులు చెప్పలేరు. దర్శనం చేసుకుని వెళ్ళండి." అన్నాను. నేనిలా అనేసరికి వాళ్ళలో కలకలం రేగింది. ఎందుకంటే మా చుట్టుపక్కల వాళ్ళు వాళ్ళకి తెలిసిన వాళ్ళను కూడా తీసుకోచ్చారు. వారంతా ప్రశ్నల చిట్టాతోవచ్చేరు కాని ఏంచెయ్యగలరు? ఈరోజు ఆఖరి కార్యక్రమంగా దేముడికి మళ్ళీహారతి ఇచ్చేను. పానకం ఇచ్చేను. దేముడు కళ్ళునెమ్మదిగా మూసుకుని "టెంపరెరీ" సమాధిలోకెళ్ళేడు. నేనందరికీ ప్రసాదం యిచ్చి పంపేశాను. నేను సాష్టాంగ నమస్కారం చేస్తుంటే దేముడు కళ్ళుతెరిచి అత్యంత సరళంగా మృదువుగా

నాసేవలను భక్తిని ఒుచ్చుకున్నాడు. మా ఆయన వచ్చేస్తారమోన' నేను చాలా భయపడుతున్నాను. "మావారికి దే ుడంటే నమ్మకాన్ని కలిగించు" అని కొరుకున్నాను. "అలాగే! అలాగే!" అన్నాడు దేముడు. "నీభక్తి, నువ్వు చేసేపూజలు ఆయన మనసులో మార్పును తీసుకొస్తాయి." అన్నాడు. నేనిప్పుడు మీకు యేసేవ చెయ్యను" అని అడిగేను. "నువ్వుయేసేవ చెయ్యగలవు?" అన్నాడు. మీ పనిచెయ్యలేక పోతే ఇంకేపనికోసం ఈ శరీరం?" అన్నాను, "కోవా నివేదనం చెయ్యి". అన్నాడు దేముడు, సరే! అన్నాను గాని కోవా ఎక్కడనుంచి తేను? మా అబ్బాయి, బాబు స్కూలు నుంచి వచ్చేడు. వాడి కాళ్ళు చేతులు ముఖం కడిగి దేవుడికి దణ్ణం పెట్టించి బజారుకెళ్ళి కొవా తెచ్చి పెట్టమన్నాను. వాడు వెళ్ళాడు. వాడు బజారునుంచి తిరిగి వచ్చేటప్పుడు వాళ్ళనాన్న చిన్నాన్న ఏదో మాట్లాడుకుంటూ రావడం చూసేడు. ఎందుకురా ఇలా వచ్చేవని అడిగితే వాడు ఇంట్లో జరిగిందంతా చెప్పేడు. అప్పుడు వాళ్ళిద్దరు ఏదో గుసగుసలాడుకుని చిన్నాన్న, "నాన్నకొంచెం ఆలస్యంగా వస్తాడని మీ అమ్మతోచెప్పు." అన్నారట. మితాయీ గొరంగో మితాయీ గొరంగో! కీ జై! అంటూ ముందు మా ఆయన, వెనుకగా మామరిది, వాళ్ళావిడ ఇంకెవరో ఒకరిద్దరు పెద్దమనుషులు, ఎనిమిది తొమ్మిదిమంది ఆడుకునే వయసుపిల్లలు, మావీధిలో ... మాయింటి వైపే వస్తున్నారు.

ఇక్కడ ఇంట్లో పరిస్థితి ఎలా వుందంటే కోవా నివేదన జరిగేక వేంకటేశ్వర స్వామి నాకు, మా పిన్నత్తగారికి, మాబాబుకి ఒక్కోకోవా బిళ్ళ ఇచ్చి, సగంకోవా బిళ్ళలు సంచిలో వెయ్యమని చెప్పి మిగిలినవి ఆనందంగా ఆరగిస్తున్నాడు. మావారు విచిత్ర వేషధారణతో ఇటే వస్తున్నారు. నాకు భయం భయంగాను, కాళ్ళు చేతులు ఆడకుండా వుంది. బుర్ర పనిచెయ్యడం లేదు. ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. ఈలోగా ఊరేగింపు మా ఇంటి ముందుకు వచ్చి ఆగింది. నే వెళ్ళి చూద్దునుకదా, మావారి అవతారం చాలా విచిత్రంగా వుంది. మొలకి నాగులగాపంచా చుట్టుకున్నాడు. ఒళ్ళంతా విభూతి చారికలున్నాయి. నుదిటి మీద వైష్ణవనామం, మెళ్ళోపూలహారాలు... ఎప్పుడూ చూడని వేషంలో ఎంతో విచిత్రంగా వున్నారు. ఆయన పూనకంతో ఊగుతుంటే మామరిది విసురుతూ, రుమాలుతో చెమట ఒత్తుతూ ఆయనను పట్టుకున్నాడు. మిగిలిన వాళ్ళు "మి తాయీ గోరంగో ప్రభుకిజై!" అని జయ జయ ధ్వనులు చేస్తున్నారు. మాయిల్లు యిల్లులా లేదు. దేవాలయంలో హారతి ఇచ్చేటప్పుడు ఎలా వుంటుందో అలావుంది. అయితే గంటలు మోతమాత్రం లేదు. వాటిస్థానంలో శంఖాలు నిర్విరామంగా వూదుతున్నారు. నా చెవులు చిల్లులు పడిపోతాయేమో ననిపిస్తోంది. ఈ హడావుడికి వెంకటేశ్వరుడు ఆరగింపు వదిలి లేచినిలుచున్నాడు. మావారు తూలుతూ స్వామి దగ్గరికి వచ్చి తీక్షణంగా చూసి నామీద ఉరిమి పడ్డారు. "ఇతనెవరు?"

మీకు తెలిదాండీ! "వెంకటేశ్వరస్వామి మనయింటికి వచ్చి పావనం చేశారు."

"హూం!.... దేవుడు ........... పావనం............ఆహా బాగుంది!" "ఊరుకోండి! మీరేంటి ..... ఈ అవతార మేంటి?" అన్నాను. అప్పుడు మావారు మా మరిదివేపు చూశారు. అతను చెప్పినది విన్నాక, నా ఆశ్చర్యానికి అంతేలేదు. ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో తెలియడం లేదు. మా ఆయనేంటీ మితాయీ గోరంగో ఏంటి?"

"ఒదినా! మీరెంతో అదృష్టంతులు. మీ యింటికి ఒకేసారి ఇద్దరు దేవుళ్ళు వచ్చేరు. పూజ చెయ్యడానికి అన్ని ఏర్పాట్లు చెయ్యండి." అని మామరిది అనేసరికి ఏమీ తోచక అలాగే నిలుచుండి

పోయాను.

"ఒద్దు! ఒక యింట్లో ఒకే దేవుడుండాలి. అతనుగాని నేను గాని... అన్నారు మావారు గంభీరంగా.

"ఒదినా! ఇదేంటి ఇలాజరిగింది! ఈ మిఠాయి గోరంగోకూడా తక్కువవాడు కాదు. పూనడానికి అన్నయ్యే దొరికాడా! గొప్పచిక్కే వచ్చిందే! ఎవరో ఒకర్నే ఎంచుకోమని గోరంగో ప్రభు చెపుతున్నారు. మీరే ఆలోచించుకోండి, ఏంచెయ్యాలో!" అన్నారు. ఇటు చూస్తే మాఆయన, అటు చూస్తే పిన్నత్తగారు. ఎవరికి స్వాగతం పలకాలి, ఎవరిని తిరస్కరించాలి. నేను మా ఆయన కాళ్ళమీద పడి వెంటేశ్వరస్వామిని సజల నేత్రాలతో చూస్తున్నాను. బహుశా స్వామి నా ఉద్దేశ్యం గ్రహించి వుంటాడు. అప్పుడు స్వామి గంభీరంగా, చూడు! ఎలాంటి కలికాలం వచ్చిందో! ధర్మం ఒక భాగమేవుంది. అధర్మం మూడు భాగాలుంది. దేవలోకంలో నైనా, భూలోకంలోనైనా ఎక్కడ చూసినా పోటీయే! ఇక్కడ నాకు పూజ జరుగుతుందని వచ్చేను. కాని ఇక్కడ కూడా ఇంకొకరు వచ్చి కూర్చున్నాడు. నా మీద నీకు నమ్మకం పోయినట్టుంది. ఒక్కక్షణంకూడా నేనిక్కడ వుండను. అపచారం, అపచారం. నా భక్తులు నా దర్శనం కోసం "క్యూ"లో నుంచుని నాకోసం ఎదురు చూస్తున్నారు. నేను వెళ్ళిపోతున్నాను. వెళ్ళిపోతున్నాను." అంటూ దభీమని కింద పడ్డారు. నేను మా పిన్నత్తగారి కూతురి మొహం మీద నీళ్ళు చిలకరించి, మా బెడ్ రూములోకి తీసికెళ్ళి పడుకో బెట్టేను. ఈలోగా మాపిన్నత్తగారు నైవేద్యం పెట్టిన కోవాలు, పూలు, పళ్ళు సంచిలో జాగ్రత్తగా సర్దింది. బట్టలు మార్చుకుని వాళ్ళిద్దరు వస్తుంటే వాళ్ళతోవచ్చి చూస్తే మావారు ఆసనం మీద. కళ్ళుమూసుకుని కూర్చున్నారు. అంతా శాంతంగా వుంది. అప్పటికే మామరిది రిక్షా తీసుకొచ్చి గుమ్మంలో వుంచేరు. వెళుతూ వెళుతూ మా పిన్నత్తగారమ్మాయి ధ్యానంలోవున్న మిఠాయిగోరంగో ప్రభు"ని తీక్షణంగా చూసి హుంకరించి రిక్షా ఎక్కికూర్చుంది. జరిగిందానికి క్షమాపణ చెప్పుకుని పాదాలమీదపడి ఆశీర్వాదం తీసుకుని లోపలికి వచ్చి చూద్దునుకదా! మొత్తం ఇంటి వాతావరణమే మారిపోయింది మా ఆయిన బట్టలు మార్చు కుంటున్నారు. మామరిది కాళ్ళుబార జాపుకుని నేల మీద కూర్చున్నాడు. వాళ్ళావిడ వంటింట్లో కెళ్ళింది. పిల్లలు కోవామీద పడుతున్నారు. నేను బొమ్మలా నిశ్చేష్టురాలినై వుండి పోయాను. ఇదంతా నమ్మలేక పోతున్నాను. "ఒదినా! మీరు చాలా అమాయికలు. ఆవిడకిగాని, అన్నయ్యకుగాని దేవుడు పూనలేదు. అదంతా వేషం. అన్నయ్య అలాగని చెయ్యకపోతే మళ్ళీ మళ్ళీ మీరు ఆవిడను పిలవడం వగైరాలు చేస్తుంటారు. చుట్టుపక్కలవాళ్ళు మన వెనకాల నవ్వుకుంటుంటారు. అందుకే మేం దీన్ని మొదట్లోనే తుంచేయ్యాలని అనుకుంటున్నాం. వాళ్ళమీద వాళ్ళు మీద పూనడం తప్పితే దేవుడికి ఇంకేమీ పనిలేదా! చదువుకున్న వాళ్ళం మనంకూడా దీనిని నమ్మడమేనా? ఇవి వున్నంతవరకు దేవుడివేషాలు ఇలా సాగుతూనే వుంటాయి" అన్నారు మా మరిది.

ఏమైనా తినడానికి పెడతావా, బొమ్మలా అలానుంచుండి పోతావా" అని మా ఆయన అడిగితే వంటింటివేపు నడిచాను.

శ్రీ కె.వి.ఎస్. రఘుపతిరావు
53-36-2, కె.ఆర్. కాలనీ,
మద్దిలపాలెం ఎక్స్‌టెన్షన్,
౦ - 13.

## పుస్తక సమీక్ష

# కె. సూర్య ముఖి నవల "మనుషులు మారినవేళ" నవల

డా.టి. రంగస్వామి

ప్రస్తుతం వస్తున్న నవలల కంటే కొంత భిన్నంగాను, కొంత ప్రత్యేకంగాను అంశాన్ని ఎన్నుకొని ఈ నవలను అందించారు సూర్యముఖిగారు. తమ నవలలను వారు ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని ఆశించి రచించినట్టుగా అనిపిస్తుంది. "Realisim to my mind implies, besides truth or details, the truth full reproduction of typical charactors in typical circumstances" (Angles) అని సమాజ వాస్తవిక చిత్రణ గురించి అన్న మాటలకు ఈ నవల సన్నిహితంగా ఉన్నది.

సూర్యముఖిగారు తమ నవలల్లో కొంత మార్కిస్టు ధోరణిలో సమాజాన్ని ప్రతిబింబింప చేశారు. జీవితమే నవల కాదు. జీవితం నవలకు ముడి సరుకు మాత్రమేనని పరోక్షంగా చెప్పారు. ఈ నవలా సంవిధానం మనం విశ్వనాథవారి 'మాబాబు, వీరవల్లడు", గోపీచంద్ "అల్పజీవి" నవలల్లో చూస్తాము. ఈ నవలలో కథ కొద్దిగా విశాలమవుతూ, ముందుకు సాగి గంభీరతతో ముగుస్తుంది. కథనంలో ఎక్కడ కూడా రచయిత్రి ప్రత్యక్షంగా కనబడరు.

ఈ నవలలో స్త్రీ, పురుష సంబంధాలు ఎలా ఉండాలో ఇప్పుడు అవి ఎలా ఉన్నాయో విస్తృత రూపంలో చెప్పబడింది. పార్వతి, శంకరం; మధు-సుమిత్ర; భువనేశ్వరి-సారధి; విద్యాధరి-మహేశ్; గోపి; మొదలగు దంపతుల జీవిత చిత్రం ఈ నవల. ఇందులోని సంభాషణలు ఇలా వర్గీకరించవచ్చును.

1. సహజంగా, నిరాడంబరంగా, మాట్లాడే భాషకు అత్యంత సన్నిహితంగా ఉంటాయి.

2. కథా వస్తువును విప్పుతూ కథను ముందుకు తీసుకపోతుంది.

3. సంభాషిస్తున్న పాత్రల మనస్తత్వాలు బయటకు వస్తవి.

ఈ నవలను చదివిన పాఠకులు ఒక మంచి నవలను చదివిన సంతృప్తిని పొందుతారు.

ఇందులోని పాత్రలన్నింటిలో సభ్యతా సంస్కారాలు దూరదృష్టి, సమాజకాంక్ష స్పష్టంగా కనిపిస్తది. స్త్రీ, పురుష సమానత్వం వ్యక్తికి, కుటుంబానికి ఎంతటి ఆనందాన్ని, అభ్యుదయాన్ని చేకూరుస్తుందో విపులంగా చెప్పిన స్త్రీవాద నవల ఇది. భువనేశ్వరి పాత్ర ద్వారా చెప్పిన ఈ వాక్యాలు చూడండి ఒకసారి.

(మనుషులు మారినవేళ - శ్రీమతి కె. సూర్యముఖి - ప్రతులకు విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాకలు పుటలు 1681+10 వెల రూ. 40/-)

"భామినా ! ప్రాధమికంగా మనిషిలో మంచితనం ఉంటే మమత అనురాగాలు కురిపించి, కృషి చేసి దారిలోకి తీసుకొని రావచ్చు. కొంత మంది సాహిత్య పఠనం ద్వారాను, కళల ద్వారాను, ఉత్తేజితులై, సంస్కారాన్ని, ఆదర్శాలను పెంపొదించుకుంటారు. సజ్జన సాంగత్యంలాగే, సాహిత్యం కళలు కూడా మానవుని పునీతం చేస్తూ ఉన్నత పథాలకు తీసుకుపోతాయి. అటువంటి విషయాలలో భర్తకు ఆసక్తి కలిగించు ఎట్టి పరిస్థితులలోనూ, పిరికి నిర్ణయం తీసుకోకమ్మా 1 విద్యాధికులు, ఉద్యోగినులు ఆడవారై ఆత్మాహుతి తప్ప వేరుగత్యంతరం లేదనే అపప్రద తీసుక రాకమ్మా ! సునడంలో ఈనాడు స్త్రీవాద రచయిత్రులు కేవలం సమస్యను చెప్పడం తప్ప దానికి ముగింపును కాని నివారణ మార్గాన్ని చెప్పడం లేదు. ఆ లోటును ఆమె తీర్చారనిపిస్తుంది.

రచయిత్రి చెప్పిన అనేకాంశాలు పాఠకులను కదిలిస్తాయి. పాఠకుల ఆలోచనలను ప్రేరేపించడం, వారిని ఒకసారి ఆలోచించుకొమ్మని పరోక్షంగా సూచించారు. రచయిత్రి ఈమార్గంలో వారు మరిన్ని నవలలు అందిస్తారని ఆశిద్దాం.

**- డా. టి. రంగస్వామి**

ఇ. నెం. 5-11-481, విద్యారణ్యపురి,
వరంగల్లు-506 009.

# జాతీయ హిందీ దినోత్సవములు
# 14-9-1996 నుండి 2-10-1996

హిందీ ప్రేమీ మండలి, మదనపల్లి మరియు మదనపల్లె హిందీ ప్రచారక సేవా మండలి సంయుక్తముగా జాతీయ హిందీ దినోత్సవాలను 14-9-96 నుండి 2-10-96 వరకు అతి వైభవముగా నిర్వహించిరి. శ్రీ టి. వెంకటాచారి ఎం.ఏ., ఎం.ఇ.డి. 2) శ్రీ ఎస్. పురుషోత్తము మరియు శ్రీ వే. సుబ్బారావు గారి పర్యవేక్షణలో 25 ఉన్నత పాఠశాల కళాశాలలలో విద్యార్థి, విద్యార్థినులకు హిందీలో వక్తృత్వపు పోటీలు, వ్యాసరచన పోటీలు నిర్వహించి, సుమారు 160 మంది విజేతలనెన్నుకొనిరి.

గాంధీగారి జన్మదినమగు 2-10-96వ తేదీన స్థానిక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల మదనపల్లె ప్రాంగణములో శ్రీ ఎస్. బషీర్ B.Sc., B.Ed. హెడ్మాష్టర్ గారి అధ్యక్షతన పెద్ద సభ ఏర్పాటు చేయబడెను. జిల్లా విద్యాశాఖాధికారి (చిత్తూరు) శ్రీ ఎం. ప్రభాకరరెడ్డిగారు ఆ సభకు ముఖ్య అతిధిగా విచ్చేసిరి. శ్రీ ఎస్. పురుషోత్తముగారు సభకు స్వాగతము పలికి అతిథుల పరిచయము చేసిరి. ముఖ్య అతిథి శ్రీ మహాత్మాగాంధిగారి చిత్రపటమును పూలమాలతో అలంకరించి జ్యోతి వెలిగించి కార్యక్రమమును ప్రారంభించిరి. అధ్యక్షులు తమ ఉపన్యాసములో హిందీ భాషయొక్క ఆవశక్యతను వివరించిరి. ముఖ్య అతిథి తన ఉపన్యాసములో త్రిభాషా సూత్రమును వివరిస్తూ హిందీ జాతీయ బాష మరియు రాజ భాష అయినందున దానిని చక్కగా నేర్చుకొనవలసిన అవసరమును విద్యార్థులకు వివరించిరి. మదనపల్లె హిందీప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ కె. సుధాకర్‌గారు హిందీ ప్రేమీ మండలి విశిష్ఠ సేవలను వక్కాణిస్తూ గత సంవత్సరమే స్వర్ణోత్సవములు వైభవముగా జరుపుకొన్నదని తెలిపిరి. శ్రీ ఎం. క్రిష్ణాజిరావుగారు మాజీ హిందీ ప్రాధ్యాపకులు మరియు ప్రిన్సిపాల్ బి.టి. కళాశాల, మదనపల్లె - తమ ఉపన్యాసములో హిందీ ఉద్భవమును వికాసమును గురించి వివరించిరి. హైద్రాబాదు ద.భా హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యకారిణి సమితి సభ్యులు శ్రీ ఎల్. బుచ్చినాయుడుగారు ఉపన్యసిస్తూ లక్షలాది విద్యార్థులు హిందీ పరీక్షలు వ్రాస్తూ అభ్యసిస్తున్నారు అని తెలుపుతూ ప్రాచీన హిందీ కవులను వారి కవితలను పరిచయము చేసిరి.

తదనంతరము చాలా కాలమునుండి హిందీ ప్రచారము గావిస్తున్న శ్రీ వే. సుబ్బారావుగారిని శ్రీ ఎం. ప్రభాకరరెడ్డిగారు పూలమాలతోను, దుశ్శాలువతోను సన్మానించిరి. అదే విధముగా జిల్లా స్థాయిలో ఉత్తమ హిందీ పండితులుగా ప్రభుత్వము చేత బహుమతి పొందిన శ్రీ టి. వెంకటాచారిగారిని కూడా జిల్లా విద్యాశాఖాధికారి పూలమాలతో దుశ్శాలువాతో సన్మానించారు. మరియు శ్రీ ఎస్. పురుషోత్తముగారు ఉత్తమ ఉపాధ్యాయులుగా సన్మానింపబడినారు. వారిని కూడా జిల్లా విద్యాశాఖాధికారిగారు సన్మానించారు.

తరువాత ఈ కార్యక్రమమునకు ఆర్థిక సహాయము నందించి ప్రోత్సహించిన శ్రీ సంపత్కుమార భట్టార్ గారిని, శ్రీ ప్రసాదరావుగారిని (ప్రధానోపా ధ్యాయులు, జ్ఞానోదయ (ఆంగ్ల మాధమము) ఉన్నత పాఠశాల శ్రీ సేతు (ప్రధానోపాధ్యాయులు శ్రీ విజయ భారతి ఆంగ్ల మాధ్యమిక పాఠశాల) గారిని పూలమాలలతో సన్మానించారు.

పై పోటీలలో విజేతలైన విద్యార్థి, విద్యార్థినులకు బహుమతులు ప్రమాణ పత్రములు అందజేశారు.

తరువాత కళాశాల, ఉన్నత పాఠశాలల విద్యార్థి, విద్యార్థినులు జాతీయ గీతములు పాడారు. నృత్య ప్రదర్శనినిచ్చి అందరి మన్ననల పొందారు.

# పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు



జననం : 15-8-1934
మరణం : 7-10-1996

## శ్రద్ధాంజలి సభ

ది 7.10.96 ఉదయం 10 గం॥లకు పట్టణ హిందీ ప్రేమీ మండలి కార్యాలయములో ప్రసిద్ధి, ఖ్యాతి చెందిన హిందీ ప్రచారకులు మరియు పట్టణ హిందీ ప్రేమీమండలి కార్యవర్గ సభ్యులైన శ్రీ డి. లింగేశ్వరరావు గారి మరణము పట్ల శ్రద్ధాంజలి సభ ఏర్పాటు చేయబడినది.

మండలి ఉపాధ్యక్షులు శ్రీ చక్కా రామకృష్ణారావు మరియు శ్రీ వేము భావనారాయణ గార్లు శ్రీ లింగేశ్వరరావుగారి త్యాగమయ జీవితమును గూర్చి వక్కాణిస్తూ, తమ దుఃఖమును వెల్లడించిరి. మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమహరనాథ శర్మగారు దివంగతులైన శ్రీ లింగేశ్వరరావుగారి హిందీ ప్రచార కార్యక్రమాలను వివరిస్తూ మరియు వారు చేసిన సేవలను స్మరిస్తూ తమ శ్రద్ధాంజలి సమర్పించిరి. మండలి సంయుక్త కార్యదర్శులు శ్రీ సిహెచ్. హనుమంతరావు, శ్రీ ఎస్. గిరిధర్ మరియు మండలి కార్యవర్గ సభ్యులు శ్రీ యమ్. యల్లారావు, శ్రీ కె. మాలినిగార్లు శ్రీ లింగేశ్వరరావుగారి మరణముపట్ల తమ ప్రగాఢ సంతాపము తెలియజేసిరి.

దివంగత ఆత్మకు శాంతి చేకూర్చమనియు మరియు శోకభరితులైన వారి కుటుంబమునకు తమప్రగాఢ సంతాపమును, ఈ అపార దుఃఖమును సహించుటకు తగిన శక్తిని యివ్వవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ శోక సంతాప తీర్మానము తీర్మానిస్తూ, రెండు నిమిషములు మౌనము పాటించిరి.

# పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు



## సంతాప సభ

ది 4.10.96 మధ్యాహ్నము 2 గం॥లకు పట్టణ హిందీ ప్రేమీ మండలి కార్యాలయములో, దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యకారిణి సమితి, మరియు నిధి పాలక మండలి మాజీ సభ్యులు, పట్టణములో ప్రసిద్ధి చెందిన వ్యక్తి, ప్రముఖ సమాజసేవకులు మరియు పట్టణ హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులైన శ్రీ గుడివాడ పుల్లారావుగారి మరణము పట్ల సంతాప సభ ఏర్పాటు చేయబడినది.

మండలి ఉపాధ్యక్షులు శ్రీ చక్కా రామకృష్ణారావు మరియు శ్రీ వేము భావనారాయణ గార్లు శ్రీ పుల్లారావుగారి మహత్వపూర్ణమైన జీవితము, వారి సేవలను గూర్చి వెల్లడిస్తూ తమ దుఃఖమును ప్రకటించిరి. మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమహరనాథశర్మ తమ శ్రద్ధాంజలి సమర్పిస్తూ, దివంగత ఆత్మకు శాంతిని చేకూర్చమని భగవంతుని ప్రార్థించిరి. మండలి సంయుక్త కార్యదర్శులు శ్రీ సిహెచ్. హనుమంతరావు, శ్రీ యస్. గిరిధర్ మరియు మండలి కార్యవర్గ సభ్యులు శ్రీ యమ్. యల్లారావు, శ్రీ కె. మాలిని మొదలగువారు శ్రీ పుల్లారావుగారి మరణముపట్ల తమ ప్రగాఢ సంతాపమును తెలియజేసిరి.

దివంగత ఆత్మకు శాంతిని చేకూర్చమనియు మరియు వారి కుటుంబమునకు తమ సానుభూతిని, ఈ అపార దుఃఖము సహించుటకు తగిన శక్తిని యివ్వవలసినదిగా ఈశ్వరుని ప్రార్థిస్తూ, ఒక శోక సంతాప తీర్మానము తీర్మానిస్తూ రెండు నిముషములు మౌనము పాటించిరి.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాద్.

**హిందీ పరీక్షల రుసుము చెల్లింపు గడువు పొడిగింపు**

దక్షిణ భారత హిందీ ప్రచార సభ 1997 ఫిబ్రవరిలో నిర్వహించబడుచున్న హిందీ పరీక్షల రుసుము చెల్లింపు గడువు పొడిగింపబడినది. ప్రారంభిక పరీక్షలకు పరీక్షా రుసుము, ధరఖాస్తు ఫారములతో సహా స్వీకరించబడు తేది 26-12-1996 వరకు, రూ. 5-00ల లేటు ఫీజుతో ది. 31-12-1996 వరకు, రూ. 10-00ల లేటు ఫీజుతో ది. 6-1-1997 వరకు పొడిగింపబడినది. అదే విధముగా ప్రవేశిక పరీక్షకు పరీక్షా రుసుము, ధరఖాస్తు ఫారముతో సహా స్వీకరింపబడు తేదీ 26-12-1996 వరకు, రూ. 10-00ల లేటు ఫీజుతో ది. 31-12-1996 వరకు, రూ. 20-00ల లేటు ఫీజుతో ది. 6-1-1997 వరకు పొడిగించబడినదని దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర, హైదాబాదు, కార్యద్సి శ్రీమతి కె. విమలాబాయి తెలియ జేయుచున్నారు.

ఈ మార్పును హిందీ విద్యార్థులు, హిందీ పండితులు గమనించగలరు.

సెక్రటరీ